# పాఠకుల దృష్టిలో...

1

ఉగాది శుభాకాంక్షలు. సంచికకు సంచికకు స్రవంతిలో వస్తున్న మార్పులు మమ్మల్నెంతో ఆనందపరుస్తున్నవి. స్రవంతిని సాహిత్య పత్రికగా తీర్చిదిద్దుతున్నందుకు సంపాదకులు అభినందనీయులు. శ్రీ శర్మగారి అనువాద కథ లేక పోవడం బాధకల్గిస్తున్నది. మే సంచికలో తప్పక ప్రచురిస్తారని ఆశిస్తున్నాము. VSTPJ Hyd-4.

2

ఏప్రిల్ సంచికలో తిలక్ కథానికల మీద వ్యాసం వ్రాసిన వ్యాసకర్త పేరును తప్పుగా ప్రచురించారు. రమేష్ బాబుకాదు. సురేష్‌బాబు అని ఉండాలి.

నాగభైరవగారి 'ఆవేశం 'అక్షరమైన వేళ' కవిత్వ సృజన సమయంలోని మానసిక స్థితిని చక్కగా వ్యక్తీకరించింది. ముఖ్యంగా 'నాకు నేనే గుర్తుండను. చెవి వినదు, అక్షి కనదు; నేను లోకంలో ఉండీ లేకుండాపోతాను' అనే మాటలు సిన్సియర్‌గా కవిత్వం వ్రాసే ఏ కవైనా అనుభవించే స్థితే.

ప్రచురించిన వ్యాసాల మీద నిష్పాక్షికమైన, సమగ్రమైన అభిప్రాయ ప్రకటనకు ఒకటి, రెండు పేజీలు "చర్చాగోష్ఠికి" ప్రతి సంచికలో కేటాయిస్తే బాగుంటుంది.

డి. సురేశ్‌బాబు, హైదరాబాద్—500183.

3

ఏప్రిల్ సంచిక, ధరకుతగ్గట్టు ఆకర్షణీయంగా ఉంది. సంపాదకీయంలో 'తెలుగు సాహిత్య పత్రికలు తమ కాళ్ళపై ఎందుకు నిలబడలేక పోతున్నవో ఆలోచించండి' అన్నారు. ఇందులో ఆలోచించటానికి ఏముంది? ఈనాటి వార మాస పత్రికలన్నీ సెక్సు-రాజకీయాలు-చౌకబారు సాహిత్యంతో నిండి ఉండి సామాజిక బాధ్యత ఏ మాత్రం లేక కేవలం ధనార్జనే ధ్యేయంగా పెట్టుకున్నాయి. చొప్పదంటులు తినటం అలవాటు అయిన తరువాత చెరుకు ఎట్లా ఇష్టం అవుతుంది? భారతి లాంటి ఏకైక సాహితీ పత్రిక అన్ని హంగులు ఉండి కూడా నిలవలేకపోయింది. ఇలాంటి పరిస్థితులలో 'స్రవంతి' లాంటి పత్రికలే ఆశాదీపాలు.

కె. రామారావు హైదరాబాద్

4

'స్రవంతి' తెలుగు సాహిత్య పత్రికలలో ముఖచిత్రం నవ్య శోభలతో సుందరంగా వుంది. రచయితల రచనలు, కవుల కవితలు జనరంజకంగా, సాహిత్య ప్రయోజనాలతో కూడి వున్నది. 'స్రవంతి' సందర్భ సేవలకుగాను ప్రతి గ్రంథాలయంలో వదిలవర్చాల్సిన ఆవశ్యకత కలదు.

'స్రవంతి', లో ప్రముఖ కవులు గుంటూరు శేషేంద్రశర్మ గారి కవిత, అంతకుముందు డా॥ సంపత్కుమారాచార్యులు, తిరుమలరామచంద్ర గారి రచనలు. (ముఖ్యంగా ఈనెల మరియు ముందు రెండు సంచికల్లోన్ని పుస్తక సమీక్షలు) బాగున్నాయి.

శ్రీమతి సుధారాణి, హైదరాబాద్.

5

మా(మీ) స్రవంతికి ఉగాది శుభాకాంక్షలు. వసంతుని ముఖచిత్రంతో అత్యంత ఆకర్షణీయంగా వెలువడ్డ ఏప్రిల్ నెల స్రవంతి అద్భుతంగా వుంది. సాహిత్య పత్రికలు కరువగుచున్న ఈ రోజులలో చీకట్లో చిఱుదీపంవలె స్రవంతిని అనేక కష్టనష్టాలకోర్చి మా కందిస్తున్న మీకు ధన్యవాదములు. పెంచిన స్రవంతి ధర అత్యల్పం.

గుంటూరు శేషేంద్రశర్మ గారి 'శ్వేత పుష్పం' కవిత చాలా బాగుంది. సత్యవాణిగారి 'జానపద గేయములు—స్త్రీల మనస్తత్వం' వ్యాసం, తిరుపతి వేంకట కవుల శైలికి సంబంధించిన వ్యాసం మమ్ములను ఆకట్టుకున్నాయి.

వ్యాసాల తరువాత ఖాళీ వదలి వేయుచున్నారు. దానిని వ్యాపార ప్రకటనలకు వినియోగించిన ఎడల స్రవంతికి కొంత ఆర్థిక ఇబ్బందులు తొలగగలవని స్రవంతి పాఠకునిగా నా అభిప్రాయము.

వి. ఆ కుమార్ హైదరాబాద్.

ఫోన్: 36866

458

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

మే 1992

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ పిన్నమనేని ప్రసాదరావు


దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఖైరతాబాద్-హైదరాబాద్-500 004

సంవత్సర చందా 40.00 రూ॥

విడిప్రతి 4.00 రూ॥

Recommended for use in all the Public libraries and School Librariesby the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings is. No. 30/55 dated 6 th January 1955.

# ఈ సంచికలో

సంపాదకీయం

# ప్రశిక్షణ విద్యాలయాలు

ఆంధ్రదేశంలో హైస్కూళ్ళల్లో హిందీ బోధించే ఉపాధ్యాయులను తయారు చేయడం కొరకై హిందీసంస్థలు హిందీ ప్రచారక్, శిక్షక్ వంటి ప్రత్యేక పరీక్షలు నడిపించి అందుకై హిందీ ప్రశిక్షణ విద్యాలయాలు నడుపుతూ వుండేవి. ఆ విద్యాలయాలలో అధ్యయనం చేసి పరీక్షల్లో ఉత్తీర్ణులైన వారిని ఆంధ్రప్రభుత్వం హిందీ ఉపాధ్యాయులుగా నియమిస్తూ వుండేది. ఆ తరువాత భారత ప్రభుత్వ సహకారంతో హిందీ సంస్థలు నడిపించే విద్యాలయాలతోబాటు ఆంధ్ర ప్రభుత్వం గూడా తాను స్వయంగా హైదరాబాదు, వరంగల్లు, నెల్లూరు పట్టణాలలో మూడు విద్యాలయాలు ప్రారంభించింది. ఈ విద్యాలయాలన్నింటిలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులు హైస్కూళ్ళల్లో పనిచేస్తూ వుండేవారు. హిందీ బోధనా కార్యక్రమం సక్రమంగా సాగుతూ వుండేది. కాని తెలుగుదేశం ప్రభుత్వం హిందీ విషయంలో కొత్త విధానాన్ని అనుసరించి, 6,7 తరగతులలో హిందీ బోధనను రద్దుచేసి 8వ తరగతి నుండి హిందీని ప్రవేశ పెట్టింది. ఈ విధానం వల్ల హిందీ ఉద్యమానికి బాగా దెబ్బతగిలింది. అంతేగాక స్కూళ్ళల్లో పని జేస్తున్న హిందీ ఉపాధ్యాయులకు పని తక్కువై వారు నిరుద్యోగులయ్యే పరిస్థితి గూడా ఏర్పడింది. అట్టి వారి సంఖ్య దాదాపు నాలుగువేల వరకు తేలింది. దీనిపై పెద్ద అలజడి ఏర్పడింది. హిందీ సంస్థలూ, హిందీ రక్షణ సమితి వంటి వారూ పదేపదే ప్రభుత్వం వారికి నచ్చజెప్పగా ప్రభుత్వం నిరుద్యోగులయ్యే ఉపాధ్యాయులను ఇంకా ఏదో పని అప్పజెప్పి ఇంటికి పంపించలేదు. అయినా అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడింది. హిందీ ప్రచారోద్యమం బాగా దెబ్బతిన్నది. ఉన్నవారికే పని లేదు గనుక కొత్తగా ఉపాధ్యాయుల్ని తయారుచేయవలసిన అవసరం లేదని భావించి ఆంధ్ర ప్రభుత్వం హిందీ ప్రశిక్షణవిద్యాలయాలను గూడా నిరుత్సాహ పరచడ మారంభించింది. దాదాపు అవి మూతబడే పరిస్థితిని కల్పించింది. హిందీ విద్యాలయాలు మూతబడ్డవి. 8వ తరగతి నుండి హిందీ

వుంటుందని అన్నా ప్రభుత్వ విధానం వలన ఎంతో ఉత్సాహంగా జరుగుతున్న హిందీ ప్రచారానికీ, హిందీ బోధనా కార్యక్రమానికీ అవరోధం ఏర్పడింది. తెలుగుదేశం ప్రభుత్వం అమలులో వున్నంతకాలం ఇదే పరిస్థితి అమలులో ఉన్నది. విద్యాలయాలు మూతబడ్డవి.

ఆ తరువాత తెలుగుదేశం ప్రభుత్వం మారిపోయింది. కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. కాంగ్రెసు ప్రభుత్వం జరిగిన పొరపాటును వెంటనే గుర్తించి 6,7 తరగతులలో హిందీని పునః ప్రవేశపెట్టింది. పొరపాటును సరిదిద్దింది. ప్రస్తుతం ఆంధ్రదేశంలోని అన్ని హైస్కూళ్ళలోనూ మొదటిలాగానే 6,7 తరగతులలో హిందీ బోధన జరుగుతున్నది. హిందీ ఉపాధ్యాయులలో నూతనోత్సాహం వెల్లివిరిసింది. కాని హిందీ ప్రశిక్షణ విద్యాలయాలు పునరుద్ధరింపబడలేదు. హిందీ బోధన అభివృద్ధి చెందవలెనంటే హిందీ ఉపాధ్యాయుల సంఖ్య పెరగడం అవసరం. ఆ లోటును గూడా సరిదిద్దమని ప్రభుత్వాన్ని తరచుగా హిందీ సంస్థలు అభ్యర్థిస్తూ వచ్చినవి. విద్యాశాఖామాత్యులు శ్రీ పి.వి. రంగారావు గారు ఈ లోటును గుర్తించి తాను చేసిన వాగ్దానానికి అనుగుణ్యంగా 29-4-92 తేదీన హిందీ ప్రశిక్షణ విద్యాలయాల కార్యక్రమాన్ని పునరుద్ధరిస్తూ ఒక జి.ఓ.ను ప్రచురింపజేశారు. ఆ జి.ఓ. ప్రతిని స్రవంతిలో వేరుగా ప్రచురిస్తున్నాము. శ్రద్ధ తీసుకొని ఈ లోటును గూడా సరిచేసిన విద్యాశాఖా మాత్యులకూ, ఆంధ్ర ప్రభుత్వానికీ మా హృదయపూర్వకమైన అభివందనాలు తెలియజేస్తున్నాము. చక్కగా జరుగుతున్న పనికి అనవసరంగా కలిగిన విఘాతానికి ఎంతో అసంతృప్తి చెందివున్న హిందీ భాషాభిమానులందరికి ఇది ఎంతో సంతోషాన్ని కలిగిస్తున్న విషయమని వేరే చెప్పనక్కరలేదు. రాబోవు జూన్, జులై నెలల నుంచి విద్యాలయాలు ప్రారంభం కాగలవని విశ్వసిస్తున్నాము. విద్యాశాఖామాత్యులకూ, ఆంధ్ర ప్రభుత్వానికీ ఇంకొకసారి ధన్యవాదాలర్పిస్తున్నాము.

# సాహిత్యవీధి

## తిలక్ కవిత్వంలో కథ

సంపతి బాల్ రెడి

ఆధునిక తెలుగుకవులలో శ్రీశ్రీ తర్వాత చెప్పుకోతగినవాడు తిలక్. శ్రీశ్రీ లాగే తిలక్ పుస్తకరూపంలో వెలువడకముందే తన కవిత్వం ద్వారా తెలుగువారి సందరినీ ఆకట్టుకొని సమకాలీన సాహితీరంగంలో విశేషమైన పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్నారు. ఆయనను మూర్తీభవించిన కవిత్వంగా చెప్పడం ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. (శ్రీశ్రీలాగే) కవిత్వంలో కథను ఇష్టపడని కవిగానూ, అనుభూతి వాద కవిగానూ ప్రసిద్ధిచెందిన తిలక్ కవిత్వంలో కథాంశకవితలు చోటు చేసుకోవడం విశేషాంశంగా భావించ వలసి ఉంటుంది. శ్రీశ్రీ కవిత్వంలోని కథాంశకవితల లాగే తిలక్ కవితలుకూడా సామాజిక వాస్తవికతకు అద్దం పడుతూ అన్నిరకాల పాఠకుల్ని కదిలించాయి. అనుభూతివాద కవిగా ప్రాచుర్యం పొందిన తిలక్ కవిత్వంలో సమకాలీన సమాజ జీవితాల్ని చిత్రిస్తూ కథాంశకవితలు చోటు చేసుకోవడానికి గల కారణాల్ని పరిశీలించి ఫలితాల్ని అంచనావేయడం ఈ వ్యాసం

'ఏ సిద్ధాంతాలకూ నిబద్ధుణ్ణి కాను' అని చాటుకొన్న తిలక్, అన్నా! కవిత్వం/అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి/ విస్తరించాలి చైతన్యపరిధి/ అగ్నిజల్లినా అమృతం కురిసినా/ అందం ఆనందం దాని పరమావధి' (అమృతం కురిసిన రాత్రి, నవత కవిత, పు. 76) అంటూ కవిత్వాన్ని నిర్వచించారు. ఈ నిర్వచనాన్ని బట్టి తిలక్ గొప్ప సౌందర్యారాధకులుగా ఆవిష్కృతులవుతారు. అందుకే తన అక్షరాల్ని వెన్నెలలో ఆడుకొనే అందమైన ఆడపిల్లలుగా భావించగలిగారు. సౌందర్యారాధకులైన తిలక్ కవిత్వంలో అనుభూతి ఛాయలు అడుగడుగునా తొంగిచూస్తాయి. 'త్రిమూర్తులు' కవిత (అ. కు. రా. పు. 163)లో 'మావాడే మహా గట్టివాడు' అంటూ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని ఉద్దేశిస్తూ చెప్పినమాటలు తిలక్ ఖచ్చితంగా అనుభూతివాదే అన్న వాస్తవాన్ని పట్టిస్తాయి.

పోస్టు: ముస్తాబాద్(వయా), జి॥ కరీంనగర్-505404.

అనుభూతి అనేది కవిఅయిన ప్రతివ్యక్తికి తప్పనిసరిగా ఉండవలసిన విలువైన అంశం. అనుభూతి లేకుండా భౌతికపరమైన ఏ భావనగానీ ఆవిష్కరింపబడదు. జీవితఘట్టాల చిత్రణ అవసరం ఉన్నతావుల్లో ఆయా పాత్రల స్వరూపస్వభావ చిత్రణలోపాటు వాటి అనుభూతుల్ని కూడా కవి తానుగా వ్యక్తం చేయక తప్పదు. కనుక వస్త్వాశ్రయ కవిత్వంలోకూడా అనుభూతి అవసరం అనివార్యం. అయితే అనుభూతి వ్యక్తిగత విషయాలకే పరిమితమైనప్పుడు అస్పష్టత, అసందర్భం చోటుచేసుకోవడానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది. తిలక్ కవిత్వంలో అటువంటి సందర్భాలు ఎక్కువగా కనిపించవు.

తిలక్ తనను గురించి అనుభూతివాదిగా చెప్పుకొన్నప్పటికీ ఆయన కవిత్వంలో 'ప్రార్థన' (పు. 107), 'ఆర్తగీతం' (పు. 143) వంటి కవితల్లో, అభ్యుదయ భావావేశం ఉన్న వస్త్వాశ్రయ కవితల్లో సహజంగానే పాత్రల స్వరూప స్వభావ చిత్రణ, వివిధ రసాల నిర్వహణ చోటు చేసుకొన్నాయి. ఫలితంగా అటువంటి కవితల్లో కథాసంవిధానం సరికొత్త రచనా రీతులలో వైవిధ్య భరితంగా చోటు చేసుకొన్నది.

తిలక్ అనుభూతివాదేకాదు, సమకాలీన సమాజ స్థితిగతులకు చలించిన మానవతావాది కూడా. సౌందర్యారాధనతోపాటు సర్వమానవ కళ్యాణాన్ని ఆకాంక్షించే అభ్యుదయ భావన, మానవతాదృక్పథం కూడా తిలక్ కవిత్వంలో ముఖ్యాంశాలుగా కనిపిస్తాయి.

'కవిత్వం ఇవ్వవలసింది ఆనందం కాదు ఉత్తేజం అని విశ్వసించే మార్క్సిస్టు విమర్శకుల దృష్టిలో తిలక్ అభ్యుదయ కవి కాకపోయినా తిలక్ హృదయంలో తోటిమానవులపై స్వచ్ఛమైన సానుభూతి ఉంది. రాజకీయ నినాదాలు నిబద్ధత మాత్రం లేవు. 'రా.రా, సారస్వత వివేచన, పు-111) అంటూ రాచమల్లు రామచంద్రారెడ్డిగారు తిలక్ కవిత్వాన్ని విశ్లేషిస్తూ చెప్పిన మాటలు ప్రత్యక్షర సత్యాలు.

తిలక్ కవిత్వంలో రాజకీయ నినాదాలు, నిబద్ధతా లేవు. కనుకనే ఆయన అభ్యుదయ కవి కాలేక పోయారు. అంతమాత్రాన కవిత్వంలో ఆయన అభ్యుదయ భావనల్ని శంకించవలసిన పని లేదు. తిలక్ మానవతా వాదంలో మానవాభ్యుదయమే ప్రధానాంశం. తిలక్ తన అక్షరాల్ని 'ప్రజా శక్తులు వహించే విజయ ఐరావతాలు'గా చెప్పుకోవడాన్ని ఈ సందర్భంలో మనం నిర్ధారించుకోవచ్చు.

శ్రీశ్రీ తన కవిత్వ సృజనకు ప్రేరేపించిన అనేక దృశ్యాల్ని పేర్కొంటూ 'కవితా ఓ కవితా!' (మహాప్రస్థానం, పు-30) అనే ఖండికలో వివరించిన' చిత్రవిచిత్ర శ్యమంత రోచిస్సివహాన్ని తలపింపచేస్తూ 'తిలక్, ఆర్తగీతం' (అ.కు.రా,పు.49) కవితలో తాను చూచిన సమకాలీన సమాజంలోని వివిధ మానవజీవిత దృశ్యాల్ని చిత్రిస్తూ సామాజిక వాస్తవికతకు అద్దం పట్టారు.

"ఆ కలితో అల్లాడి/మర్రిచెట్టుకింద మరణించిన ముసలివాణ్ణి/నిజంగా శీరంధ్రవర్షాన వంతెన కింద/నిండుచూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన/హృదయ విదారక దృశ్యాల్ని' పాఠకుల కళ్ళకు కట్టినట్లు చూపుతూ,

'నేను చూశాను నిజంగా/ క్షయగ్రస్త భార్య ఇక బ్రతకదని/డాక్టరు చెప్పినప్పుడు/ప్రచండ వాతూల హతనీప శాఖవలె గజగజ వణికిపోయిన/ఆరక్త అశక్త గుమస్తాని/అయిదారుగురు పిల్లలు

గలవాణ్ణి' (అ.కు.రా.పు.50) అంటూ అత్యంత సహజంగా వివిధ రచనాకృతుల్లో సామాజిక వాస్తవికతను వ్యక్తం చేస్తూ పాఠకుల్ని కదలింపచేయడంలో ఆయన మానవతా దృక్పథం స్పష్టంగా కనిపిస్తుంది. ఏమాత్రం అభ్యుదయ కామన, మానవతా దృక్పథం లేని కవి ఇంత హృదయ విదారకంగా, ఇంత శక్తిమంతంగా మానవ జీవిత దృశ్యాల్ని పాఠకుల మనోఫలకాలపైకి ట్రాన్స్‌పరెంట్ చేయలేడు.

తిలక్ కవిత్వంలోని అభ్యుదయ భావననీ, మానవతాదృక్పథాన్నీ 'నిన్నరాత్రి' కవిత. (అ.కు. రావు. 125) ఆధారంగా నిరూపిస్తూ చెప్పిన వరవరరావుగారి మాటల్ని ఈ సందర్భంలో గుర్తు చేసుకోవడం అనుచితం కాదనుకొంటున్నాను.

"తిలక్ కవిత్వంలో నన్ను బాగా ఆకర్షించింది 'నిన్నరాత్రి' అనే కవిత. ఒక విధంగా నా కందులో శ్రీ తిలక్ కవిత్వతత్వమంతా ఇమిడి ఉన్నట్లుగా తోచింది. అంతేకాదు, ఆయనకూ తక్కిన అభ్యుదయ కవులకూ ఉన్న భేదం కనిపించింది. చాలామంది అతి నవీనుల మనుకొనేవారు తిలక్ ఎక్కడ ప్రాచీనుడని పొరపాటు పడుతున్నారో, సంప్రదాయ సాహిత్యకులమనేవారు ఎక్కడ తిలక్ తమ మార్గంలోని వారని భ్రమపడుతున్నారో కూడా నా కందులో అవగాహన అయింది. ఆ కవితలో ఒక యువకుని అకలి చావు, మానాన్ని అమ్ముకొని ఉరిపోసుతున్న సానిదానిగాథ ఇలాంటి అభ్యుదయ కవితా వస్తువులన్నీ ఉన్నాయి. 'కాంగోలో, క్యూబాలో, లావోస్‌లో, సైప్రస్‌లో కాలి కమురు కంపు కొట్టే కాలంకథ, మానసవ్యథ ఉంది అందులో. అయితే మరి తేడా ఎక్కడంటే- ఇన్ని నేను నా మంచం మీద వచ్చి కూర్చున్న దేవుణ్ణి అడుగలేదు అంటూ చెప్పడంలో ఉన్నది. ఆయన ఊరక అల్లరి చేయడు. ఆయన స్వభావంలో లేదది. ......ఆయన కుహనా కర్మ సిద్ధాంతులవలె ఆ బాధ్యతంతా దేవుని మీద వేయలేదు, పెద్దవాడు, కన్న కడుపు మానపుడే దానవుడై వర్తిస్తుంటే దేవుడు మాత్రం ఏం చేస్తాడు. అని, ఈపనునన్నిటికి మూలం మానవ స్వభావం అని తేల్చి వేస్తాడు. ఇక్కడే ఆయన సిద్ధాంతాలకు అతీతమైన మానవతా ధర్మాన్ని ప్రతిపాదించేది' (వరవరరావు, సృజన, ప్రథమ సంచిక, నవంబరు 1966, పుట — 43).

అభ్యుదయ కవిత్వకాలపు భావజాలం తిలక్ మీద విశేషమైన ప్రభావాన్ని చూపింది. తన దేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా తనని కదిలించిన హృదయ విదారక సంఘటనల్ని, యుద్ధాలనీ, సమకాలీన సమాజంలోని మానవజీవిత అందాల్ని వస్తువులుగా తీసుకొని, సంకుచితమైన కులమత ప్రాంత భేదాలకు అతీతంగా సర్వమానవ కళ్యాణాన్ని ఆశిస్తూ తిలక్ తన కవిత్వాన్ని వెలువరించారు. ఆయన కున్న మానవతా దృక్పథంవల్లే సమకాలీన సమాజంలోని ఆర్థిక అసమానతల్నీ, మూర్తీభవించిన దైన్యాన్నీ, దగాపడిన అనేక పాత్రల దయనీయ పరిస్థితుల్నీ యథాతథంగా చిత్రించగలిగారు. తనకాలపు సమాజస్థితిగతుల్ని చూసి తట్టుకోలేని తిలక్ కోమల మనస్తత్వమే ఆయన కవిత్వంలో అంతః కథా సూత్రంగా ప్రతిబింబిస్తుంది.

అయితే ప్రాచీన కవిత్వంలో కనిపించే విధంగా జీవితకాలానికి సరిపడే విస్తృత పరిధితో కూడిన ఇతివృత్తాన్ని కాదని, జీవితంలో ఏ ఒక్క సంఘటననో, సన్నివేశాన్నో, పాత్రల సజీవ స్వరూప స్వభావాలనో, వాటి సంఘర్షణనో పట్టిచ్చే పరిమిత పరిధి కలిగిన ఇతివృత్తాలతో, ఆధునిక కాలానికి అందుబాటులోకి వచ్చిన కథాత్మక

ప్రక్రియల్ని పోలి వస్త్వాశ్రయకవిత్వం హ్రస్వలిపి సంవిధానాన్ని సంతరించుకొని ఆధునిక కవిత్వంలో వెలువడింది. ఆ విధంగా మొదట అభ్యుదయ కవిత్వంలోచోటు చేసుకొన్న వస్త్వాశ్రయ కవితలు కథా సూత్రానికి కట్టుబడి కొన్ని, కథానిర్మాణానికి సహకరించే అంశాలలో ఏ కొన్నైనా ఉండి మరి కొన్ని సామాజిక వాస్తవికతకు అద్దంపట్టాయి. ఈ విధానం సరికొత్త రచనా రీతులతో తిలక్ కవిత్వంలో కూడా కనిపిస్తుంది.

కవిత్వంలో 'కథ'ను ఇష్టపడని (చూడండి, కె. వి. ఆర్. అంగారవల్లరి కవితా సంపుటికి శ్రీశ్రీ రాసిన ముందు మాట, 1959 ఆగష్టు 31) శ్రీశ్రీ కవిత్వంలో జీవిత ఘట్టాల చిత్రణ అవసరమైన తావుల్లో 'కథ' చోటు చేసుకొన్నట్లే, కవిత్వంలో 'కథ'ను ఇష్టపడని తిలక్ కవిత్వంలో కూడా జీవిత ఘట్టాల్ని చిత్రించ వలసిన సందర్భాల్లో కథా సంవిధానం చోటు చేసుకోక తప్పలేదు. ఏ కవికైనా జీవితాన్ని చిత్రించాల్సి వచ్చినప్పుడు పాత్రనో, సంఘటననో, సన్నివేశాన్నో ఆలంబనం చేసుకోక తప్పదు కనుక కథా సంవిధానం ఆ సందర్భంలో అనివార్యం అవుతుంది. ఈ విషయం సాహిత్యకారుల్లో చర్చకు వచ్చినప్పుడు తిలక్ తన అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చారు.

కవిత్వంలో కథలు చెప్పడం ప్రాచీనకాలంలో ఉండేది. సాహిత్య పరిణామాన్ని బట్టి చూస్తే కథా కావ్యాల ఆవశ్యకత సన్నగిల్లిందని 'నవత' పత్రిక మూడవ సంచికలో రాసిన ఒక వ్యాసంలో తిలక్ వివరిస్తూ, కథా రహితంగా కవిత్వాన్ని అనుభవించగలగడం ఆధునిక పాఠకుడు పొందిన వికాసం వలన కలిగిన ఫలితమని ఇది పూర్వులకు లేద'ని అభిప్రాయపడ్డారు.

'ఈనాటి కవిత చురుకైన ఆవేశాన్నీ, సాంద్రతరమైన అనుభూతి ఒత్తిడినీ, సూక్ష్మమైన భావనని అనువదించడానికి తన స్థానాన్ని ప్రత్యేకించుకుంది. అందువలననే దేశదేశాల నవ్యకవితా విలసనంలో కథాభాగం వెనక్కి వెళ్ళిపోయింది. కవిత తన పరిధిని స్పష్టంగా నిర్ణయించుకో గల్గుతుంది' అంటూ ఆధునిక కవిత్వంలో 'కథ' కనిపించకుండా పోవడానికి గల కారణాల్ని తిలక్ వివరించారు.

'పాఠకునిలో రసోత్పత్తి జరగాలంటే 'కథ' ఉండాలనేది పూర్వుల ఉద్దేశ్యం. నాటి పాఠకుని మనస్థితి ఒక్కసారిగా అనుభూతిని చటుక్కున అంది పుచ్చుకొనే స్థాయిలో ఉండక పోవచ్చును. కాని కవితా స్వరూపం నిశితమైనకొలదీ, భావనాత్మకమైన కొలదీ అటు పాఠకుని మనస్థితి కూడా సమానమైన నైశిత్యాన్ని పొందింది. కనుక నేటికవిత్వం 'కథాసంవిధానం' అనే అనవసరపు తొడుగుని విప్పుకొని ప్రధాన అనుభూతుల ఆకృతితో దర్శనమిస్తోంది.' (తిలక్, నవత మూడవసంచిక, 1964 సెప్టెంబర్, పు-146–148) అంటూ తిలక్ అటు కవిత్వ పరిణామాన్నీ ఇటు పాఠకుల మానసిక స్థాయినీ అంచనా వేసుకొని కవిత్వంలో కథాస్థానాన్ని నిర్ధారించారు.

ఆధునిక కవిత్వంలో తిలక్ నిర్ధారించిన కథాస్థానాన్ని ప్రత్యక్షరప్రమాణంగా భావించవచ్చు. అయినప్పటికీ ఆధునిక కవిత్వంలో జీవితఘట్టాల చిత్రణ జరిగిన సందర్భాల్లో కథాసంవిధానం చోటు చేసుకొన్న ఖండిక కనిపిస్తున్న సత్యాన్ని కాదనలేము. ప్రధాన అనుభూతుల ఆకృతితో దర్శనమిస్తోన్న కవితలలో కూడా పాత్రలు తమంత తాముగా బయటపడుతూ వాటి జీవిత నేపథ్యాల్ని ఏకరువు పెడుతూన్న సందర్భాల్లో 'కథాసంవిధానం' ఆధునికంగా, ప్రస్ఫుటంగా

ప్రదర్శితమవుతుంది. ఇంకా కొన్ని సందర్భాల్లో బహుపాత్రల్ని కల్గి సంవాదఛాయలతో నాటకీయ తను సంతరించుకొని సమాజ జీవితఘట్టాల్ని ఆవిష్కరిస్తున్న కవితలు కూడా ఆధునిక కవిత్వంలో కనిపిస్తున్నాయి.

తిలక్ కవిత్వంలో కూడా 'కథాసంవిధానం' సరికొత్త రచనారీతులతో చోటు చేసుకొంది. వివిధ పాత్రల స్వరూప స్వభావచిత్రణ, వివిధ రసాల నిర్వహణ జరిగి తిలక్ కవిత్వం సమకాలీన జీవితాల్ని ఆవిష్కరించింది. అయితే ఆయన కవిత్వంలో చోటుచేసుకొన్న కథాంశకవితలు భావకవుల అనుభూతి అభివ్యక్తి విధానంలోనూ, సమీక్షాపద్ధతిలోనూ, కథాకథన పద్ధతిలోనూ సాగి, కథాసూత్రానికి కట్టుబడికొన్ని, కట్టుబడక మరి కొన్ని సరికొత్త శిల్పవైవిధ్యంతో వెలువడ్డాయి.

అటువంటి వాటిలో 'ఆర్త గీతం' (అ.కు.రా. పు. 49), 'ముసలివాడు' (అ.కు.రా.పు. 22, 1943), 'తపాలా బంట్రోతు' (అ.కు.రా.పు. 66) 1959), 'సైనికుడి ఉత్తరం' (అ.కు.రా.పు. 25, 1943), 'అమ్మా నాన్న ఎక్కడకు వెళ్ళాడు?' (అ.కు.రా.పు. 104, 1965), 'సి.ఐ.డి. రిపోర్టు' (అ.కు.రా.పు. 131, 1965), 'గొంగళిపురుగులు' (అ.కు.రా.పు. 57) వంటి కథాంశకవితల్ని పేర్కొవచ్చు.

తిలక్ 'ఆర్తగీతం' కవితలో తాను చూసిన అనేక హృదయవిదారక దృశ్యాల్ని కరుణరస ప్లావితంగా వర్ణిస్తూ పాఠకుల మనోఫలకాలపై చెరగని ముద్రవేస్తూ కథనం చేశారు. 'మర్రిచెట్టు క్రింద మరణించిన ముసలివాణ్ణి, వర్షంలో వంతెన కింద ప్రసవించి మూర్ఛిల్లిన అనాథ స్త్రీని, ఆయి దారుగురు పిల్లలూ; క్షయగ్రస్తభార్య కల్గి దీనాతి దీనస్థితిలో ఉన్న గుమాస్తాని ఇలా తిలక్ తాను చూసిన దీనుల్ని ఎందరినో కథనం చేశారు.

నిస్సహాయురాలైన 'ముసలిస్త్రీభిక్షుక'

[illegible] కప్పువంగిపడుపాడితిల్లువల' ఉన్న వృద్ధుణ్ణి 'ముసలి వాడు' కవితలో రూపుదాల్చిన దైన్యానికి సంకేతంగా చిత్రించారు. ఆదే విధంగా ముసలివాడి బతుకుని 'ఆరిన వత్తి కొడి'లా తిలక్ వర్ణించడం, శ్రీశ్రీ వర్ణించిన 'ఆరినకుంపటి విధాన ఉన్న భిక్షువర్షీయసి' ని తలపిస్తుంది.

జీవితంలో ఒకప్పుడు బాగుగా వెలిగిన ప్రొఫెసర్ 'ముసలివాడు' కవితలోని పాత్ర. ఆ పాత్ర చేతనే తిలక్ 'ముసలివాడు' కవితని కథనం చేయించారు. ఆ పాత్ర తానుగా తన స్వరూప స్వభావాల్ని, జీవిత నేపథ్యాన్ని వర్ణించుకుంటూ పాఠకులకు నేరుగా పరిచయం చేసుకొంటుంది. ఈ కవితలో ఉత్తమ పురుష కథా సంవిధానం స్పష్టంగా కనిపిస్తుంది. ముసలివాడు తన దైన్య స్థితిని పాఠకుల కళ్ళకు కడుతూ ఇలా తనను తాను పరిచయం చేసుకొంటాడు.

కనుగూడులు నల్లనయి/ పెనుగూడులు చల్ల నయి/ కీలుకీలుగా, బాధగా/ నాడునాడులుసాగగా చలిగాలి చూరులో కసిరినటు/ చలిచీమ మట్టిలో దొలిచినటు వచ్చినది./ మూగినది మసిరినది ముసలితనము/ముసలివాణ్ణి నాయనలారా ముసలి

–

'విధి లిఖించిన వెర్రి చిత్రమువలె/ఎండిపోయిన ఏటిగట్టువలే/నడుమునొప్పి తనకుమిగిలిన శక్తిగా/ పక్షవాతభయం తన భవిష్యదాశగా/ కదలలేక మెదలలేక/ మెతుకులు కతకలేక చావుని వెదికికొనే' ఒకప్పటి తన ఒయ్యారపు భార్యని పరిచయం చేస్తాడు ముసలివాడు.

చివరకు వాడు చేయబోయే 'నాగరికతగమ్యం చరిత్రల సారాంశం' అయిన మృత్యు లోకాన్ని ఎవరికీ అర్థంకాని భయంకరమైన ఏకజిగా, తుది ఊపిరి వసలే లోపంగా భావిస్తూ ఆ వృద్ధుడు తమ ల ముగింపు స్థితిని కళ్ళకు కట్టినట్లు సూచిసాడు.

ఈ కవిత అంతా ప్రధాన అనుభూతుల ఆకృతిలో కనిపిస్తున్నప్పటికీ కథా నిర్మాణానికి సహకరించే అంశాలు ఇందులో స్పష్టంగా చోటు చేసుకొన్నాయి.

ఎత్తుగడ, పాత్ర చిత్రణ, ఫ్లాష్‌బ్యాక్ (గత జీవితం), సంఘర్షణ, పతాక సన్నివేశం, ముగింపు, కొసమెరుపు మొదలయిన అంశాలు ఈ కవితలో సందర్భోచితంగా, సహజంగా సంలీనమై కని పిస్తాయి. కథా దృక్పథంతో పరిశీలించినప్పుడు ఈ అంశాలు స్పష్టంగా కనిపించినప్పటికీ ఈ కవిత 'ముసలివాడి' ఏక పాత్ర అభినయంలా పాఠకుల మనోఫలకాలపై కదలాడుతుంది. ఆ విధానంలోనే తిలక్ ప్రొఫెసర్ ముసలివాడి జీవతాన్ని కథనం చేశారు. దీనిని తిలక్ ప్రత్యేక రచనా సంవిధానంగా భావించవలసి ఉంటుంది.

'ముసలివాడు' పాత్రద్వారా వృద్ధదంపతు లైన ప్రొఫెసర్ అతని భార్య గత జీవితానికి, అప్పటి వారి వృద్ధాప్య జీవితానికి భౌతికంగానూ, మానసికంగానూ వచ్చిన పరిణామాల్ని తిలక్ చక్కగా రూపుకట్టారు. పేద, ధనిక భేదం లేకుండా ప్రాణమున్న ప్రతి ఒక్కరికీ తప్పని సరియై వచ్చే వృద్ధాప్య దశలో, వివిధ శారీరక, మానసిక, వ్యాధులకు దారుణంగా గురవుతూ, కాటికి కాలుచాచి చావుకుసిద్ధంగా ఉన్న ఎందరో వృద్ధులకు ప్రతి నిధులుగా వృద్ధదంపతుల్ని చిత్రించి తిలక్ వారి జీవితాన్ని కథనం చేశారు.

'తపాలా బంట్రోతు' కవితలో తిలక్, సంఘంలో సామాన్యజీవి అయిన ఒక పోస్ట్‌మ్యాన్ సుబ్బారావును అత్యంత సానుభూతితో చి త్రించారు. లేఖలను బట్వాడా చేయడం ద్వారా సమాచారాన్ని అందిస్తూ అందరికీ ఆత్మీయుడై, అందరి సుఖ దుఃఖాలలో పాలుపంచుకొనే తపాలా బంట్రోతు వ్యక్తిత్వాన్ని ఎవ్వరూ గుర్తించరనీ, అతని కష్ట సుఖాల మీద వారికి ఏ మాత్రం సానుభూతి ఉండ దనీ తిలక్ తన విచారాన్ని వ్యక్తం చేశారు. ఈ కవిత, సుబ్బారావు అనే మిత్రుడు జిల్లా తపాలా శాఖ జరుపుకొనే వార్షికోత్సవానికి పోస్ట్‌మ్యాన్ మీద రాయమని తిలక్‌ని కోరినప్పుడు రాసిచ్చిన కవిత. అయినా తిలక్ పోస్ట్‌మ్యాన్ నిత్యజీవితపు లోతుల్లోకి వెళ్ళి, సానుభూతిలో ఈ కవితను కథనం చేయడంవల్ల పోస్టుమ్యాన్ సమాజంలో ఏ కొందరి గుర్తింపుకైనా నోచుకోవడానికి పాత్రుడు కాగలిగాడు.

పోస్టుమ్యాన్ నిర్వర్తించే విద్యుక్త ధర్మాన్ని, సంఘంలో అతడు ఏకాకిగా మిగిలిపోయే తీరుని వర్ణిస్తూ తిలక్,

"ఎన్ని యిళ్ళు తిరిగినా/నీ గుండె బరువు దింపుకోవడానికి ఒక్కగడప లేదు/ఎన్ని కళ్ళు పిలిచినా ఒక్కనయనం నీ కోటుదాటి లోపలికి చూడదు, ఉత్తరం యిచ్చి నిర్లిప్తుడిలాగా వెళ్ళిపోయే నిన్ను చూపినప్పుడు తీరం వదలి సముద్రంలోకి పోతున్న ఏకాకి నౌక చప్పుడు(ఆ.కు.రా.పు. 160) అంటూ పోస్టుమ్యాన్ ఎకాకి జీవితాన్ని 'ఏకాకి నౌక' తో పోల్చి కొసమెరుపులా అతని కథకు సందర్భోచితమైన చక్కటి ముగింపు ఇచ్చారు.

ఈ కవితలో తపాలాబంట్రోతు పాత్ర ఉంది. తమ జీవితాల్ని అస్పష్టంగానైనా ఆ

ఆవిష్కరిస్తూ తపాలాబంట్రోతు తెచ్చిచ్చే లేఖల కోసం పడిగాపులు పడి విఫల మనోరథులైన మరెన్నో పాత్రలు కూడా అలవోకగా ఈ కవితలో చోటు చేసుకొన్నాయి. తపాలాబంట్రోతు యొక్క విద్యుక్త ధర్మం విద్యుక్త ధర్మ పాలన ద్వారా సంఘంలో ఆ పాత్రకున్న గుర్తింపు మొదలయిన అంశాలు చక్కగా చిత్రించబడ్డాయి. ఈ అంశాల ఆధారంగా తిలక్ పోస్టుమ్యాన్ జీవితాన్ని విశ్లేషిస్తూ సమీక్షా పద్ధతిలో కథాసంవిధానాన్ని చక్కగా నిర్వహించారు.

'సైనికుడి ఉత్తరం' కవితలో తిలక్ సైనికుడి పాత్రను ప్రవేశపెట్టి, యుద్ధరంగంలో ఎదురయ్యే అతడి పరిస్థితుల్ని ప్రత్యక్షంగానూ, అతడి కుటుంబాన్నీ జీవితాంశాలనీ పరోక్షంగానూ కథనం చేశారు. ఈ కవితలో తిలక్ యుద్ధ భూముల్లో సైనికవీరులుగా ఉన్న వారి కర్తవ్య పాలన వెనుక దాగిన దయనీయ పరిస్థితుల్ని, వారికి ఎంతో దూరదూరాల్లో ఉన్న వారి కుటుంబీకుల మధుర స్వ[illegible]లు కలగించే వియోగబాధల్ని పాఠకులకళ్ళకు కట్టినట్టు చిత్రిస్తూ వర్ణించారు.

సైనికుడు తనభార్యతో గడిపిన మధుర స్మృతుల్ని తలచుకొంటూ 'తిరిగి ఎప్పుడు మన ఊరువస్తానో నిన్నుచూస్తానో అందమైన తెల్లని నవ్వు నీ మెడలో గొలుసులు కదిలినప్పుడు ఆదోవిధమైన చెమ్మగిలిన చూపు. నెమలి రెక్కలా విప్పుకొన్నప్పుడు'' అని ఉత్తరం రాస్తూ అనుభూతుల్ని నెమరు వేసుకోవడం ద్వారా భార్యమీద ఉన్న తన ప్రగాఢ ప్రేమను వ్యక్తం చేశాడు. 'నిన్ను చూస్తానో' అన్న మాట యుద్ధం పూర్తయ్యేవరకు ప్రాణాలతో ఉంటేనే ఆమెను చూడటం అన్న ఫలితం దక్కుతుందన్న ధ్వని, కర్తవ్యపాలనలో ఉండే రాగద్వేషాతీతమైన దీక్ష కరుణ, వీర రసాలతో నిండి పాఠకుల్ని కదిలిస్తుంది.

'ఇంక సెలవ్ మైడియర్/నిద్రవస్తోంది మత్తుగా నల్లగా/అడుగో సెంట్రీ..../డేరా ముందు గోరీలా జడ్డాడు/అదిగోయింకా..../కార్పొరల్ బూట్ చప్పుడు/ కడుపులో నీళ్ళు కదులుతున్నట్లు/జాగ్రత్తసుమీ జాగ్రత్త' అంటూ ఉత్తరానికి ముగింపు ఇస్తూ సైనికుడు భార్యతో సెలవుతీసుకొనే ఈ సన్నివేశం (సందర్భం వేరైనప్పటికీ) గంగినేని చిత్రించిన 'ప్రియుడు ప్రియురాలికి' (ఉదయిని పు.18) అనే లేఖారూపక కవితలోని చివరి సన్నివేశాన్ని తలపింప చేస్తుంది.

ఈ కవిత 'ముసలివాడు' కవితలాగే, సైనికుడి ప్రధాన అనుభూతుల ఆకృతిగా రూపుదిద్దుకోవడం ద్వారా యుద్ధభూమిలో సైనికుడి స్థితి గతులు అతని ఇంటిలోని భార్య, సంతానం, తల్లి, వస్తువులు వెరసి సైనికుడి జీవితాన్ని ఆవిష్కరించాయి. 'ముసలివాడు' కవితలాగే 'సైనికుడి ఉత్తరం' కవిత కూడా ఉత్తమ పురుష కథనంలో సాగి అతడి జీవితాన్ని తెలియ చేసింది. వ్యక్తీకరణంలో వైవిధ్యాన్ని సంతరించుకొంది.

భారతదేశం వీరమాతలకు, వీరపత్నులకు పుట్టినిల్లు. అకుంఠిత దేశభక్తి గల భారతీయ వీర జవానుల,వారి భార్యల త్యాగనిరతిని చాటే కథాంశం గల మరోకవిత 'అమ్మా! నాన్న ఎక్కడకు వెళ్ళాడు. సైనికుల ఇతివృత్తం కలిగున్న పై కవితలోనూ, ఈ కవితలోనూ కరుణ, వీర రసాన్ని సమస్థాయిలో ప్రధానంగా పోషించి తిలక్ పాఠకుల్ని కదిలింప చేశారు.

చైనా పాకిస్తాన్ దేశాల యుద్ధకాలంలో భారతీయ సైనికులు విజయం సాధిస్తూ పొందిన వీర

మరణాన్ని రేడియో వార్త ద్వారా విన్న భారతీయులు వారికి కృతజ్ఞతాంజలులు అర్పిస్తూ 'జై హింద్' నినాదాలు చేస్తుంటారు. ఆ సందర్భంలో వీరజవానైన తన భర్త మరణాన్ని ధ్రువపరచుకొన్న ఒక భారతనారి,

'అమ్మా! నాన్న ఎక్కడికి వెళ్ళాడు
ఇంకా రాడేం! అని అడుగుతున్న
కుమారుణ్ణి అక్కున చేర్చుకొని/
ఆమె కూడా రుద్ధకంఠంతో 'జై హింద్' అని మెల్లిగా
పలికింది/ఆ మాట స్వర్గంలో ఒక మహావీరునికి
హాయిగా తీయగా వినపడింది (పు.105). ఆ మహా
వీరుడు ఎవరోకాదు. ఆమె భర్తే.

జీవిత భాగస్వామిని కోల్పోయిన దుఃఖభారంతో కంఠం రుద్ధమైనప్పటికీ 'జై హింద్' అని మెల్లిగా అయినా అనగల్గిన ఒక భారత స్త్రీని వీర భారత నారీమణులకు ప్రతినిధిగా తీసుకొని తిలక్ ఆమెను ఆదర్శమూర్తిగా చిత్రించారు. భారతీయ జవానుల. వారిపత్నుల ఆత్మౌన్నత్యాన్నీ, త్యాగశీలతను, దేశభక్తినీ ఈ కవితలో తల్లీ కొడుకుల పాత్రల ద్వారా తిలక్ స్పష్టం చేశారు. 'అమ్మా! నాన్న ఎక్కడకు వెళ్ళాడు' అంటూ హృదయవిదారకంగా అడిగే నాలుగేళ్ళ పిల్లవాడి ప్రశ్న పాఠకుల్ని కదిలింపచేస్తుంది.

ఈ కవితలో కథా నిర్మాణానికి దోహదం చేసే అంశాలు ప్రస్ఫుటంగా చోటుచేసుకొన్నాయి. ఈ కవితలోని కథాంశానికి ఎత్తుగడగా సంవాదాత్మకమైన పిల్లవాడి ప్రశ్న, ఆ తర్వాత పిల్లవాడి తల్లి కళ్ళల్లో ఫ్లాష్‌బ్యాక్ చిత్రణ ద్వారా ఆమె భర్త యుద్ధభూమిలో ఉన్న వీరజవానుగా పాఠకులకు స్ఫురింపచేయడం, ఆమె పార్కు 'పార్కు బెంచీ మీద నుండి లేచి పిల్లవాడికి చేయూత నిచ్చి మెల్లగా నడుస్తూ మునిమాపు చీకట్లలో కలిసి పోయింది' అని చెప్పడంలో సన్నివేశ వాతావరణ కాలాల చిత్రణ, ఆ తర్వాత కవి తానుగా చేసిన కథనం ద్వారా పిల్లవాడి తల్లి స్వరూప స్వభావ చిత్రణ; దినచర్యవివరణ; ఆమె పనిగట్టిన ఏదో మార్పుకి నేపథ్యంగా పాకిస్తాన్ చైనాల యుద్ధానికి దారితీసిన పరిస్థితుల వివరణ, యుద్ధఫలితాల్ని రేడియో వార్తల ఆధారంగా తెలుసుకొన్న ప్రజల్లో పెల్లుబికిన ప్రతిస్పందనని సంకేతించి, పిల్లవాడి ప్రశ్నకు సమాధానంగా పాఠకులకు స్ఫురించునట్లు సంఘర్షణకులోనైన పిల్లవాడి తల్లిచేత 'జై హింద్' మాటని నినదింపచేయడం; ఎత్తుగడ చరణాల్లో ఆమెకు ఉన్నవని చెప్పిన ఆహార్యాంశాల్ని, ముగింపుకు ముందు చరణాల్లో లేవని చెబుతూ అవే చరణాల్ని కథనం చేయడం, చక్కటి సందేశాత్మకమైన ముగింపుతో ధ్వని పూరితంగా కొసమెరుపును ఇవ్వడం అనే ఈ అంశాలు ఈ కథాంశ కవితలో కథా సంవిధానాన్ని స్పష్టంగా స్ఫురింప చేస్తున్నాయి. కరుణ, వీర రసపోషణ పాఠకుల్ని కదిలింప చేస్తుంది.

ఆశలు అకియాసలై, ప్రయత్నలోపం లేకున్నా లక్ష్యాలకు లక్షల యోజనాల దూరంలోనే ఉండి వెనకబడుతున్న మధ్యతరగతి జీవితాల దైనందిన పరిస్థితుల్ని వర్ణిస్తూ 'అయినాపురం కోటేశ్వరరావు' లాంటి వారిని మధ్యతరగతి జీవులకు ప్రతీకలుగా తీసుకొని తిలక్ 'సి.ఐ.డి. రిపోర్టు','గొంగళి పురుగులు' కవితల్ని రాశారు.

సి.ఐ.డి. రిపోర్టు కవితలో తిలక్, గుమాస్తా అయిన అయినాపురం కోటేశ్వరరావు మరణాన్ని సమీక్షిస్తూ, ఆ మరణానికి కారణమైన అతని జీవితాన్నీ, జీవిత విధానాన్నీ కథనం చేయడం ద్వారా మధ్య తరగతి జీవితాలకు చక్కగా అద్దంపట్టారు.

"ఇతని తండ్రి గుమాస్తా/ తాతగుమాస్తా, ముత్తాత గుమాస్తా/ సాంప్రదాయకమైన వినయ విధేయతలకి/ గౌరవకరమైన దారిద్ర్యానికి వీళ్ళ వంశం ఒక రాస్తా/ ఇతనికి ఇంట్లో ఆరుగురు పిల్లలూ/ ఒక ముసలితల్లీ/ ఒక్కచెల్లీ/ ఒక్కతే నీరసంగా ఉన్న భార్య/ ఇతనద్దెకున్న వాటాలో రెండున్నరగదులూ/ ఒక టెలివిజన్ లాంటి బాత్‌రూమ్, ఒక అటకా (అ.కు.రా.వు.182)అంటూ కోటేశ్వరరావు వంశపారంపర్య వృత్తినీ, ఆతని కుటుంబాన్నీ, అద్దె ఇంటినీ అత్యంత సహజంగా తిలక్ చిత్రించారు.

వృత్తికే అంకితమై ఇతర మేమీ ఎరుగని కోటేశ్వరరావు ప్రవృత్తిని గూర్చి తిలక్ "అతడు యోగికాడు- కవి కాడు, లంచాలు పట్టడు.ఎవరినీ తిట్టడు, ఎవరేమన్నా పట్టించుకోడు". అంటూ అతనిమానసిక స్థితిని ప్రతిభావంతంగా వర్ణించారు.

చనిపోయేముందు రోజునే కనకయ్య అనే మిత్రుణ్ణి కలుసుకొని 'సుఖమంటే ఏమిటి? ఎలా ఉంటుంది? ఎక్కడ దొరుకుతుంది?' అని అడిగే కోటేశ్వరరావు లాంటి పాత్రల్ని సమకాలీన సమాజంలో తిలక్ ఎందరినో చూసి ఉంటారు. అటువంటి వారికి ప్రతినిధిగా తానెరిగిన అయినాపురం కోటేశ్వరరావు పాత్రని తీసుకొని తిలక్ సామాజిక వాస్తవికతకు చక్కగా అద్దం పట్టారు. తిలక్ ఈ కవితను సమీక్షా పద్ధతిలో కథనంచేశారు.

ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నట్లుండే బల్లపరుపుగా పరుచుకొన్న జీవితాలని దృష్టిలో ఉంచుకొని తిలక్ మధ్యతరగతి జీవుల్ని' గొంగలి పురుగులుగా చిత్రించారు; గొంగలిపురుగులు 'కవితలో అనుకున్నవి అనుకున్నట్లుగా ఏవీ సాధించలేక కుటుంబసభ్యుల్ని ఏవిధంగానూ తృప్తి పరచలేక, చివరకు జీవితం నుండి నిష్క్రమిద్దామనుకొన్నా భార్యకేకకో, బాస్‌కేకకో భయపడి చావలేక బతకలేక రొటీన్ జీవితానికి అలవాటుపడి బల్లపరుపుగా పరచుకొన్న జీవితాల్ని ఈడుస్తూ బతుకుతున్న కోటేశ్వరరావు, వీరేశ్వరరావు లాంటి మధ్యతరగతి(గుమస్తా)జీవులస్వరూప స్వభావాల్ని చిత్రిస్తూ అత్యంత వాస్తవికాంశాలతో తిలక్ చక్కగా కథనం చేశారు.

కవిత్వంలో 'కథ' అవసరంలేదనిఅభిప్రాయ పడ్డ తిలక్ ఈ విధంగా కథావస్తువులనే కవితా వస్తువులుగా గ్రహించి, సునిశిత భావపరంపరల దాటున అందంగా పొదిగి, హ్రస్వలిపి కథాసంవిధానంతో అందరికీ ఆస్వాదయోగ్యంగా కవిత ల్లారు. అనేక పాత్రల్ని తన కవిత్వంలో ప్రవేశపెట్టి సమకాలీన సమాజంలోని జీవితాల్ని అనేక కోణాలనుండి ఆవిష్కరించారు.

తిలక్ కవిత్వం సమాజంలోని కేవలం క్రింది తరగతి సామాన్యుల జీవిత చిత్రణకే పరిమితం కాలేదు. తనని కదిలించిన నిరుద్యోగుల గుమస్తాల సైనికుల, మధ్యతరగతి జీవితాలని కూడా అత్యంత వాస్తవికాంశాలతో హృదయవిదారకంగా చిత్రించినారు. మౌలికంగా తిలక్ అనుభూతివాది అయినప్పటికీ తనకున్న అభ్యుదయధ్యేయాన్ని, మానవతా దృక్పథంతోనే తన కవిత్వంలో సామాజికత వాస్తవికతకు యదాతథంగా అద్దం పడుతూ సరికొత్త రచనారీతుల్లో కథాంశ కవితల్ని వెలువరించారు.తద్వారా అన్ని రకాల పాఠకులకు సామాజిక వాస్తవికత తెలిసి వచ్చింది. ఆ విధంగా తిలక్ సామాజిక చైతన్యానికి ఏ కొంతైనా దోహదం చేశారని రూఢీగా చెప్పవచ్చు.

# విశ్వంభర- నేపథ్య ప్రేరణ

డా॥ తలముడిపి బాలసుబ్బయ్య

ఆచార్య సి. నారాయణరెడ్డి కీర్తికి పతాక విశ్వంభర. సందర్భాం వేరైనా ఇందులో-

అడుగుతున్నాయి
జ్ఞాన పీఠికలను

జీవిత లక్ష్య సాధనలో (47) అంటూ ఉన్న భావానికి సార్థకంగా విశ్వంభర సి.నా.రె.కు జ్ఞాన పీఠికను సాధించి పెట్టింది. ఇట్లా కావ్యగతార్థ విషయం, ఫలసిద్ధి రెండూ ఒకటే కావడం యాదృచ్ఛికం. అయితే మానవుని మనస్సులోపలి పొరలలో బలంగా ఉన్న ఊహలు అక్కడక్కడా అన్యాపదేశంగా బైటపడటం సహజమని సైకాలజీ చెప్తుంది.

విశ్వంభర ఒక కథాకావ్యమనీ సి.నా.రె. ప్రస్తావనలో ప్రస్తుతించారు; కాని ఇందలి కథ ఒకే ఇతివృత్తానికి చెందింది కాదు. ఇది మనిషి కథ అనడం వల్ల భిన్న విషయాలకు స్థానం కలిగించక తప్పదు. ఇతిహాసం అన్నదానికి సార్థకంగా ఇందులో చరిత్రాంశాలకు ప్రాధాన్యం కాస్త ఎక్కువే.

పూర్వుల భావాలలో నచ్చిన దాన్ని తన బాణీలో క్రొత్తగా అదిగించడం సి.నా.రె. ప్రత్యేకత. పదాన్ని కాని, అర్థాన్ని కాని అనుకరించడంలో చిన్నతనమేమీలేదు. మహాకవులంతా అంతో యింతో అనుకరించినవారే. అయితే అందరికీ తెలిసినవిషయాన్ని ఒక క్రమంలో కూర్చడంలో క్రొత్తదనం లోపించక తప్పదు. విశ్వంభరలో మానవుని నాగరికతాభివృద్ధి లలితకళల వికాసం, బుద్ధుడు, అలెగ్జాండర్, భారత స్వాతంత్ర్య పోరాటం మొదలైన వాని చరిత్రలు ప్రధానంగా స్థానం పొందడం వల్ల నవ్యత మృగ్యం. అంతస్సత్వంలో హృదయానికి తగిలే వాడితో అపూర్వతాఫలంతో లోకానికి ఏదైనా క్రొత్తగా గ్రహించదగిన విషయాన్ని అందజేయగల్గడం కవిత్వానికి ప్రాథమిక లక్షణం. అదిలోపిస్తే విషయం చర్విత చర్వణమే అవుతుంది.

ఇదొక ప్రాచ్యపాశ్చాత్యవిశ్వాసాలసమ్మేళనం ఈ జగత్తుకు అయిదు తత్త్వాలు కారణం. అయినట్లే ఇందలి విషయం అయిదు ఖండికల్లో ప్రసక్తం.

సి.నా.రె. అన్నట్లుగా విశ్వంభరలోది కథ అను కునేకంటే భిన్న విషయాల మేళవింపు అంటే బాగుంటుందనుకుంటాను. ఎందు కంటే కథకు జీవమైన ఉత్కంఠ ఇందులో కనపడటం

మోహినీపుర, సిద్దిపేట, మెదక్ జి।

లేదు. ఏకాంశ వ్యగ్రత లేకపోవడమేదానికి కారణం. యథార్థకథనానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చే చరిత్ర విషయాలు ఇందులో ఎక్కువగా చోటు చేసుకున్నందువల్ల క్లైమాక్సు ప్రశ్నే లేదు. సంగీతావిర్భావంతో ప్రారంభమైన లలితకళావికాసంలో మిగిలిన నాట్యాదులూ, బాల్యవర్ణనతో ప్రారంభమైన జీవిత దశల్లో యౌవనాదులూ, అనివార్యంగా ఉంటాయని ముందే రాబోయే విషయాలు స్పష్టంగా తెలుస్తుండటం వల్ల ఆలోచనలకు కూడా అవకాశమే కరువైంది.

ఇక వస్తు విషయానికి వస్తే-ఆదం ఈవ్‌ల కలయికతో సృష్టి ప్రారంభమైందనే బైబిలుగాథ ప్రేరణగా విశ్వంభర రచనకు శ్రీకారం చుట్టారు సి.నా.రె.

'లోతుల్ని లోబరచుకున్న లోయలూ
ఎత్తుల్ని ఎగరేసుకున్న కొండలూ'
తేనె చుక్కలను కలిపి కుట్టిన ఈగలూ
విషబిందువులను గూళ్ళు కట్టిన నాగులూ'(4)

అంటూ ఉన్న జగత్తు, జీవోత్పత్తులూ,

'నన్ను చేరింది సుతిమెత్తగా
నరాల్లో మెరుపులు సాము గరిడీలు చేయగా'
(13)

అంటూ ఉన్న ఆదాము-అవ్వల శారీరక తృష్ణలు బైబిలుపురాణం నుండి రూపుదిద్దుకున్నాయి

'చెట్టు గొడు గయ్యింది
గుహ గుండె తెరుచుకుంది' (18)

అంటూ ఆది మానవుడు చెట్లక్రింద, కొండ గుహల్లో నివసించడం మొదలుగా నాగరికతలో ఆధునికంగా ఎదిగి ప్రకృతిశక్తులను జయించి,

'తిరిగే చక్రాల ఉరవడిలో
పరుగు బతుకు మలుచుకొని' (20)

అంటూ అంబరాన్ని పిడికిలించు కోవడం వరకు ఉన్న చరిత్రదశలను మొదటి ఖండికలో ఇరవై పుటలలో కూర్చారు సి.నా.రె.

మానవునిలోని బహుముఖీనమైన కళాతృష్ణ కారణంగా పెక్కు కళలు ఆవిర్భవించిన విషయాన్ని సి.నా.రె. రెండవఖండికలో వివరించారు. మానవుడు తనచుట్టూ ఉన్న జంతువుల అరుపుల నుండి సంగీత స్వరాలను ఏర్పరుచుకొని

'తోలు కదిలొచ్చింది డోలుగా
కంచు కలిసొచ్చింది తాళంగా' (23)

అంటూ సంగీతాన్ని ఆవిష్కరించినట్లు చెప్పారు.

'అరికాళ్ళలో జోర బడ్డాయి
ఉరకలు వేసే వేళ్ళు' (25)

అంటూ నాట్యకళను మానవుడు సిద్ధపరచినట్లు చెప్పారు.

ఇక్కడ సాహిత్య ఆవిష్కారాన్ని చరిత్రగా ఒక క్రమంలో పేర్కొన్నారు.

'అరచిన బలి పశువు కంఠం,
ఉరిమింది వరుణ మంత్రంగా'
—వేదం (28)

'గుండె పగిలిన తమసా తీరం
ఘూర్ణిల్లింది శోకచ్ఛందంగా'
-వాల్మీకి- రామాయణం(28)

'చెమ్మగిల్లిన విరహం చేయిసాచి
కమ్ముకుపోయింది ఆషాఢ మేఘంగా'
—కాళిదాసు—మేఘసందేశం(28)

'చూపునోచుకోని నయనం
ఊహసాచి రూపెత్తింది

పోగొట్టుకొని పొందిన స్వర్గంగా'
భవభూతి— ఉత్తరరామ చరితం.(28)

'కవితాత్మ అక్షరాలు తొడిగింది
కమనీయ రాస రహస్యాలకు'
—భాగవతం(29)

'వినిపించింది విహాయసమంటి
కర్మక్షేత్రంలో కాళ్ళు వణికిన నరులకు
నిష్కామకర్మ భావాలను'
—భారతం(29)

ముఖాంలో పద్మాల పునర్ముద్రణలు
కళ్ళల్లో కలువల కలభాషణలు'
—ప్రాబంధికరచన (29)

'ఆకాశం రాల్చింది జలదబాష్పం
రాత్రిని ఆవరించింది కృష్ణపక్షం'
భావకవిత్వం—కృష్ణశాస్త్రి (29)

అంటూ సాహిత్యచరిత్ర క్రమంగాపేర్కొనబడింది.

'ఆకులమీద, రేకులమీద,
గోళ్ళమీద, గోడలమీద'- (31)
'రెక్కలెత్తి ఎగిసింది
రేకలెత్తి నడిచింది' - (31)

అంటూ చిత్రకళనూ,

'తడిమింది ఉలి
ముడులు విప్పుకోలేని బండచూపులను'(58)

అంటూ శిల్పకళనూ వివరించారు సి.నా.రె.

ఇట్లా లలితకళల ఉత్పత్తి వికాసాలు పద్యాలుగు పుటలను అలంకరించాయి.

విశ్వంభరలో మూడవఖండికముఖ్యమైనదని పలువురు విమర్శకుల అభిప్రాయం. విశ్వంభరలోని ప్రధాన ఖండికలకు పేర్లు సూచించని సి.నా.రె. ఇందులో 'బుద్ధుడు, అలెగ్జాండర్, ఏసుక్రీస్తు' అంటూ ఉపవిభాగాలను సూచించడం వల్ల ఆయన దృష్టిలో కూడా ఈ ఖండికకు ప్రత్యేకత ఉన్నట్లు తెలుస్తున్నది. అయితే ఇట్లా ఈ మూడు పేర్లనే పేర్కొనడంలో ఆశించిన ప్రయోజన మేమిటో అర్థంకావడంలేదు. విశ్వామిత్రుడు, గాంధి, లింకన్, మార్క్సు మొదలైన వాళ్ళ ప్రస్తావన ఇందులో ఉన్నా పేర్లతో వాళ్ళను సూచించలేదు. 'మనిషి సాధన త్రిముఖం—కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికత' అని ప్రస్తావనలో మానవతత్త్వాన్ని వ్యాఖ్యానించిన తత్త్వాలకు కూడా ఈ ముగ్గురూ ప్రతీకలు కాదు. మత ప్రమేయంలేని లౌకిక తత్త్వానికి (Secularism) సి.నా.రె. ప్రత్యేకంగా ప్రాధాన్యమివ్వాలన్న ప్రయోజనాన్ని ఆశించారేమో?

మానవునిలో బహుముఖాలుగా నిండిన మానసిక వ్యామోహాలను ఆ యా వ్యక్తిత్వాల ద్వారా వ్యక్తపరచారు సి.నా.రె.

విశ్వామిత్రునిలాంటి వాడు కూడా పద్మం లాంటి స్త్రీ ముఖం కనబడితే

'తలెకెగసిన లోకంటి చూపు
వెలికుబికింది ఆత్రంగా (42)

అంటూ నిగ్రహం కోల్పోయిన మానవుడు పతన మౌతాడనీ,

'శిలలో పొంచెత్తింది అల
హిమంలో పొడుచుకొచ్చింది సుమజ్వాల'(42)

అంటూమేనకా సంభోగాన్నీ చెప్పారు.

బుద్ధుని భూతదయ, యవన యోధుడు అలెగ్జాండర్ క్రూరత్వం, ఏసుక్రీస్తు దుఃఖసహిష్ణుతలు మూడవ ఖండికలో ఇరవై ఎనిమిది పుటల్లో విస్తరిల్లాయి.

మానవ జీవిత-దశలైన—
'బురద పిసికి

బుగ్గలకు పూసుకొని' —బాల్యం

'లౌకిక పూలరేకులన్నీ
తరుణి పెదవులనుకొని —యౌవనం(64)

'ముదిమిని తొడుక్కున్న మనిషి
ముచ్చటించుకున్నాడు తనలోతాను'—
వార్ధక్యం (65)

మరణం, పునర్జన్మ, ఆత్మ—జగత్తుల అంతర తత్త్వాల అగమ్యత, ఆధునిక నాగరికతాభివృద్ధి, మానవుని నైతిక పతనం నాల్గవ ఖండికలో ఇరవై రెండు పుటల్లో వ్యాప్తిపొందాయి.

బ్రిటిషు సామ్రాజ్యవాదుల దమననీతి,
'నల్లని భుజంమీద వాలింది
తెల్లని చేయి పావురంలా' (87)

అంటూ గాంధి, నెహ్రూల సత్యాగ్రహసమరం మార్క్స్ మహాశయుని సామ్యవాద ప్రస్థానం, భారత స్వాతంత్ర్య పోరాటం, స్వాతంత్ర్య లబ్ధి, వైజ్ఞానికంగా ఎదిగిన మానవుడు స్వార్థ కోశాన్ని ఛేదించలేకపోవడం మొదలైన అంశాలు విశ్వంభరా తత్త్వంగా అయిదవ ఖండికలో పదహారు పుటలలో విస్తరించాయి. ఇట్లా నూరు పుటలలో విశ్వంభర ముగిసింది.

ఈ విశ్వంభర కావ్య నిర్మాణ నేపథ్యంలో శ్రీశ్రీ ప్రభావం స్పష్టంగా కనపడుతుంది. అనేక యువకులపై అపారమైన ప్రభావాన్ని చూపిన పదునైన రచయిత సి.నా రె.కూడా శ్రీశ్రీపైగొప్ప గౌరవ భావాన్ని చూపారు.

పూర్వ కవిస్తుతిలో—
'కన్నెర్ర జేసింది కవితాత్మ
కట్టెపుల్లలు కరవాల ధారలుగా
మట్టి ముద్దలు మహాగ్ని గోళాలుగా
గొర్రెగొంతులు శార్దూల ఘోషలుగా
బొమికెల గూళ్ళు ప్రభంజన శ్వాసలుగా
గళమెత్తి పాడింది కవితాత్మ' (30)

అంటూ శ్రీశ్రీ సామ్యవాద గీతాలాపనకు ప్రతిస్పందించి సి.నా.రె. తమ గౌరవాన్ని ప్రదర్శించారు.

శ్రీశ్రీ మహాప్రస్థానంలోని 'మానవుడా'అన్న ఖండిక ఆదర్శంగా విశ్వంభరలో మొదటి మూడు ఖండికలను సి.నా.రె. మలిచినట్లు కనపడుతుంది.

'రాశి చక్రగతులలో
రాత్రిం దివాల పరిణామాలలో
బ్రహ్మాండ గోళాల పరిభ్రమణాలలో
కల్పాంతాలకు పూర్వం కదలిక పొందిన
పరమాణువు సంకల్పంలో
ప్రభవం పొందినవాడా!
మాధవుడా! మానవుడా!' (మానవుడే-మహాప్రస్థానం) అనే మానవుడా అనే ఖండిక ప్రారంభ విభాగాన్ని

'ఈ పొరలో జడమౌనం
ఒళ్ళు విరుచుకున్నప్పుడు-'
విశ్వంభర (1),

'ఇంతకూ నేనెవణ్ణి
ఏ కాలం ఒంటివాణ్ణి
వెర్రెత్తిన ఏశక్తి విసిరేసిన కందుకాన్ని' (4)

అంటూ సి.నా.రె. భావసామ్యంతో విశ్వంభరను ఆరంభించినట్లుంది.

'సౌందర్యం ఆరాధించేవాడా
కవితలో, శిల్పంలో, పురుగులో, పుష్పంలో
మెరుపులో, మేఘంలో
సౌందర్యం ఆరాధించేవాడా!
జీవించేవాడా! (—మానవుడా)

అనే మానవుడా రెండవ భాగాన్ని ఆదర్శంగా సి నా.రె. మానవునిలోని కళాతపనను తమ రెండవ ఖండికలో విస్తరించినట్లు అనిపిస్తుంది.

'ఆలోచనలు పోయేవాడా।
అనునిత్యం అన్వేషించేవాడా।
చెట్టూ, పుట్టా,
ఆకసంలో, సముద్రంలో
అన్వేషించేవాడా,
'ఊర్ధ్వ దృష్టీ।మహామహుడా।
కాట్లాడుకునే వాడా। ఓర్వలేని వాడా।
సంకుచిత స్వభావుడా।
దుఃఖమయా। దయామా। పరమదుఃఖా
సహనశీలీ।
బుద్ధమూర్తీ। జీసస్। (మానవుడా)

అంటూ ఉన్న మానవుడా ఖండికలోని ఇతరభాగాలను విశ్వంభరలో సి.నా.రె. తమ మూడవ ఖండికకు ప్రేరణగా వాడుకున్నట్లు కనవడుతున్నది.

ఇంకా ఇలాంటివే మరికొన్ని ప్రేరణలు-

(1) 'ఏటిని చీల్చాడు రెండుగా
ఈదెల్లాంటి చేతులతో' (20)
వంతెనలు నిర్మించినవాడా।' (మానవుడా)

(2) 'దూరాన్ని దృశ్యంగా మార్చి
దృశ్యానికి నాదం కూర్చి
కంటి ఇంటిలో చేర్చి
కాపురం చేయిస్తున్నాడు' (70-71)
'దూరదృష్టీ। దూరశ్రవణ శక్తులు
సాధించినవాడా।' (మానవుడా)

(3) గంగిరెద్దుల కొమ్ముల్లో
కత్తి మొనలు మెరుస్తున్నాయి
గోమాత గిట్టల్లో
కొడవలి అంచులు నడుస్తున్నాయి
తెగిపోతున్న కండలు
ఎగురుతున్నాయి జెండాలుగా' (89)
-తిరుగబడే వాడా।ప్రశ్నించేవాడా।
అన్యాయాలకు ఆహుతి కావడానికైనా
జంకనివాడా।'(మానవుడా)

మొదలైన చోట్ల శ్రీశ్రీతో భావసారూప్యం స్ఫురిస్తున్నది.

అక్కడక్కడా-
'కాళ్ళు విరిగి నేలమీదపడ్డ మబ్బులు
మళ్ళీ కాళ్ళను మొలిపించుకున్నాయి' (1)

వంటి పదబంధాల వక్రతలోని ప్రయోజనం సామాన్య పాఠకులకు అందడంలేదు.

సూర్యాస్తమానాన్ని సూచించే-
'పడమటి ఉరికంబం మీద
వెలుతురు తలను వేలాడదీసినఅస్తమయం,(3)

వంటి పదబంధంలో సూర్యాస్తమానాన్ని జుగుప్సాకరంగా చెప్పడంలోని ఔచిత్యం ఏమో?

క్రూరుడైన అలెగ్జాండర్ దాడిలో
'పారిపోతున్నాయి పల్లెలు
పిరౌతున్నాయి నగరాలు
ఒక్క పూరిగుడిసె తప్ప
ఒక్క బడుగు ముసలి జంట తప్ప' (52)

అనడంలో ఆ ప్రవాహానికి చరిత్రలో ఎదురీదిన ఆ ముసలిజంట పూరిగుడిసె లేవో అంతుపట్టడంలేదు. దీనికి కూడా ఏ బైబిలు కథ లాంటిదో ఆధారంగా ఉందేమో? అట్లైతే పౌరాణిక విషయాన్ని చరిత్రలో జతపర్చడం ఎట్లా కుదురుతుంది? అనే ప్రశ్న ఉత్పన్నం కాక తప్పదు.

విశ్వంభరరచనలో కవితావేశం మందగించి బలవవంతంగా సాగదీసిన ఛాయలు కనబడుతున్నాయి. మొత్తానికి సి.నా.రె. కవితామయ సృష్టి. ఇంద్రజాలం కారణంగా విశ్వంబర ఎందరో సహృదయ రారాజులకు ఒక నూతన వస్తుక్రాంతిని కలిగించింది. ఫలితంగా విశ్వంభర పెక్కు అవార్డుల తోరణాలను వెలిగించింది. విశ్వంభర సి.నా.రె. యశస్సిద్ధికై ఎత్తిన జయకేతనంగా మాత్రమే నిలుస్తున్నదన్నది వాస్తవ సత్యం.

# పుట్టపర్తి వారి మేఘదూతం వినిపించిన శ్రామిక జన జీవనగీతం

శేషమ్ లక్ష్మీనారాయణాచార్య

కాళిదాసు రచించిన మేఘ సందేశ కావ్యానికి తెలుగులో వచ్చిన అనువాదాలు, అనుసరణలలో మొట్టమొదట పేర్కొనదగినది పుట్టపర్తి నారాయణాచార్యుల వారు రచించిన మేఘదూతము. ఇది అనుసరణ మాత్రమే కాని అనువాదం కాదు. సందేశాన్ని మేఘునితో పంపడం అదే విషయం, దారి చెప్పటం అనే విషయం తప్ప కాళిదాసు మేఘ సందేశంతో ఈ కావ్యానికి ఎక్కడా పోలిక లేదు. కాళిదాసు కావ్యములో నాయకుడు యక్షుడు. ఇందులో సామాన్యుడైన 'ఖైదీ' నాయకుడు.

ఇది గేయంలో రచింపబడిన మొట్ట మొదటి సందేశకావ్యము. వీరి తరువాత ఇట్టి సందేశ కావ్యముల వస్తు వైవిధ్యముతో అనేక మంది ఆధునిక కవులు రచించినారు.

ధనిక వాదమును నిరసించిన కారణంగా అధికారులచేత నిర్బంధితుడైన ఒక సామాన్య మానవుని నాయకునిగా చేయుట సమకాలీన సాంఘిక పరిస్థితులను చిత్రించుట దీనిలోని నవ్యత. గేయములో స్వతంత్ర సందేశ కావ్యము'గా మరి యొక విశిష్టత దీనికున్నది.

మేఘ దూత కావ్యము ఖండగతిలో సాగుతూ చాలా వరకు యతి, ప్రాస, అంత్యప్రాసలతో నల రారినది ఇందలి ఛందస్సు సమపాదములుగా కాక మధ్యమధ్య, తాళానికీ, రాగానికీ. అనుకూలంగా చక్కని విరుపులతో సాగుటవలన గతి వైవిధ్య మేర్పడి, లయోత్కర్ష కూడా కలిగినది.

ఈకావ్యము పది ఖండముల గేయ కావ్యము. ధనికులను నిరసించినందులకు అధికారులచేత కుటిల కారాగార కఠిన దంష్ట్రా క్రకచదళితుడై' తన ప్రేయసి స్మృతికిరాగా మబ్బుతో పంపుకున్న సందేశమే ఈ గేయకావ్యము.

ఆతడు 'తలయెత్తి చూచి, ప్రియురాలి
తలపోసి యేడ్చి'
విరహబాధ నొంది
'తరుణ విరహయుగాలు-దంపతులనూరార్చ
మరుడు బంపిన చిన్ని మరులపడవయుబోలె'

మింటిమార్గాన వచ్చుచున్న మేఘాల్ని చూచి' చిన్ని చుక్కల చెలువు జిలికించు ప్రియురాలు, ఉన్నదో లేనిదో; యీ యుర్విపై' అంటూమొదలిడి 'నీ మెరుపు పోకలే చక్కందనాలూ' అయిననేమి

లిటిల్ ఫ్లవర్ స్కూల్ వెనుక, ఎల్.బి.నగర్-500968, హైదరాబాద్.

చూడు, మాత్మ విరహంబులో, చెయిదమేమీ లేక చెరసాల మరణంబు అని అపరాధి పల్కె- శోకాత్మకము కావ్యము.

అట్లు పలికిన కావ్యములో వినిపించినవెన్నో శ్రామిక జన జీవనగీతాలు. ఆ జీవన గీతాను శీలనమే ప్రస్తుత వ్యాసోద్దేశము.

'మనుజులను నేగోరలేను, శిలలైన మనసులకు నే పాడలేనూ' అని స్వార్థంబులీమర్త్య జాతిలోనున్నంత పెరుగలేదింకమీతరములందనుకొందు' అని మనుష్యులకన్నా మేఘుడే నయం అన్న భావాన్ని వ్యక్తీకరించి ధనికులపై తన వ్యతిరేకతను ప్రదర్శిస్తాడు.

మేఘునకు మార్గాన్ని సూచిసూ మూడవ ఖండంలో" స్తనగుతుచ్చాలపై దట్టాడ చెమరింత, రాళ్ళు మోయుచున్నవారి, యౌవనము, దీళ్ళ చంద్రిక లైనవారి, కడుపునకు, గాయమమ్మిన యట్టి కనికాంగులకు సుంత తోయదానం చిమ్ము' మంటాడు వారికి తోచిన దానం అనియైనా, తోయం దానమనియైనా అనునర్థంలో, 'నీవైనా' అనటంలో మానవులకా సద్బుద్ధి లేదనే ధ్వనితో రాళ్ళుమోయుచున్న వారిని చూపించి,

"నిండుటాకలి దూయ, మండుచెండలుగాయ నడపినుగుల వోలె నిలిచి, శిరసుపై గడుధూళి యనుదుమ్ము బెరసి, "కనవడెడు హరిజనులపై సుంత యాదరము నీవైన పరపరా, అని, మనుజులు స్వార్థపరులేగాని ఇట్టి నిర్భాగ్యులగూర్చి యాలోచన చేయరు. నీకన్న వారి నోదార్చు వారే లేరూ, అంటూ అంటరాని వారి స్థితిగతులను తెలుపుతాడు.

"అటుచూడవోయీ" అంటూ చూపించి,

"కంకరను గొట్టుచున్నాడూ, పొట్టలో, పొక్కలేర్పడు బిల్లవాడూ, వానికను గ్రుడ్లలో కన్నీరు కొంచెముగ దిగజారి కాయగాచిన వాని కరమె గాల్చుచునుండె" అంటూ కంకర పగులగొట్టు బాలునొక చోట దర్శింపజేసి, తిండిలేని వాని దీనస్థితిని కన్నులకు గట్టుతాడు.

"వాడి కమ్మరిచూడు, దౌర్భాగ్యములగూడు కొలిమి నూదుచున్నాడూ, తనపొట్టకోసరైనవయుచున్నాడూ అల్లంతదూరాన నదె వాని తొయ్యలిని గనుగొమ్ము" జీరాడు చనులతో చీరనోచనిది పాలకై యేడ్చుచున్న బుడతనికి "చనుబాల నిచ్చునో తనయురము జీల్చి రక్తంబులే దూపునో, ధనికులే మెరుగుదును" అంటూ కష్టపడుచున్న కమ్మరి వానిని వాని కుటుంబ పరిస్థితిని చూడుమంటాడు.

"అదిగదిగో" చాకితను చూడూ........
కట్టుకొనగా చెన్నుగల బట్టయే లేదు, కడుపుబిగువే లేదు కటిని బిగువేగాని అని నడకలలో మట్టెల శబ్దమొక పాటవలె విన్పించుచున్న చాకితను ఆమె స్థితిని తెలియజేస్తాడు. కటిబిగువేకాని కడుపు లేదనడంలో ఆమె ఆకలితో నకనకలాడిపోవుచున్నదని ధ్వని.

నాలుగవ ఖండమందు,

'పల్లెపు పట్టులయందు పయనించు సమయాల పాలేరు వాడుగన్పించూ, మిడియెండ బిద్దలుగ గొట్టి పండించూ' వాడెంత గష్టించినా, మిరపకారమే సంగటికి' అంటూ పాలేరు వానినిచూపించి వాడెంత కష్టపడినా వానికి మిగులునది, మిరపకారము, సంగటి మాత్రమే వాని కష్టసంపదంతా దోపిడికి గురియగుచున్నదని బాధను వ్యక్తం చేస్తాడు. 'వచ్చె వచ్చెను వానవల్లప్పలని నిన్ను మెచ్చుకొని కేకిసలు గొట్టు పిల్లవాండ్రను చూపించి, ఇంపు పాట

లతో గుచ్ఛ గుచ్ఛలు గట్టి గడ్డిమోపులు శిరస్సుల కంపములుగా చెన్నుగల చెలియంత్రను; పొలము లందు సంచరించెడు వానికి సంగటిని గొనిపోవు సకియలను చూడకుండా వెళ్ళవద్దని కోరుకుంటాడు.

'వారు పణ్యాంగనలు' అని చూపించి వారిని చూచి, 'కోపాన మూతి ముడిచేవూ, గర్జించి బెదర గొట్టేవూ' అని అందరు చూచినట్టుగా వారిని నీవు కూడా చిన్న చూపు చూడవలదు అని ప్రార్థించి వారాస్థితికి చేరుటకు కారణమును, 'కూటికై తను వమ్ము కొన్నారు', కడుపునిండా తిండి దొరికినచో వారుకూడా 'పాతివ్రత్య భావంబు బలికేరు' అంటూ పణ్యాంగనలను వర్ణిస్తాడు.

ఇట్లు పల్లెపట్టులలోని వారి మనసు లోతులను తెలిసికొని వారి వరుసలను ఎంచుకొన్నచో పురుషులు స్త్రీలు కలిసి జీవించు జనుల జీవితమే వేరంటాడు.

'వ్యభిచార దోషము నాకట్టవలెనంచు' నీతు లను బలుకు నాయకులను గూర్చి వారి వ్యభిచారిణులకు 'ఇవ్వరేగాని, ఉప్పు-ధర్మార్థములతో' గడుపుతారనియు, అర్థమే సర్వమై స్వార్థమ్ము బెరిగిన' దని, నాయకులు మాటల సంతకు నావో మూచెడన్నట్లుగా నీతులు బలుకుదేగాని వారికొక్క పైసయు దానము చేయరు. వారి జీవితములు సరిదిద్దుటకే యుపాయములను వెతుకరు అని వ్యభిచారిణుల స్థితిగతులను మన ముందుంచుతాడు.

ఇక ఐదవఖండమునందు "సింగిణీలను చేత బట్టి చెంచితలు చరియింత్రు జిగిరావు గట్టి" అంటూ చెంచుస్త్రీలను చూపించి "వారు శివదీక్షితలు, వహ్ని కీలల చెలులు' అని వారి గొప్పతనమును తెలిపి వారి నిస్సార కటి భాగముల... చూపు నిలపకు అనిహెచ్చరిస్తాడు. ఆ పిదప లంబాడీ స్త్రీని గూర్చి తెలుపుచూ, అడవిదారులలో చీకటి నుండును గాన లంబాడీ స్త్రీల మెరుపులో దారి

చూచుకొని వచ్చునని; 'ఆకాశమును జూచనేమో విద్యుదాలోకంబునొంచు నేమో' అంటాడు. వారు 'ఉప్పు-నాగరికతల కోర్వనట్టి' వారిసోయగము నీ కానందము కలిగించును. అని లంబాడీ స్త్రీల జీవితములు చీకటిమయములైనా సోయగములు మరువరానట్టివని లంబాడీ స్త్రీల జీవితమును దెలుపుచూ 'అడవిదారుల జిక్కి సుడివడెడి లంబాడి' అంటాడు.

మరొకచోట "అడవి గొల్లల గుడిసె గుడిసె. లందందుగనిపించు'నని ఘుమ ఘుమ మ్మనుచు కవ్వవు బాట సోకూ, కంచుకంబులకు నలుగని ప్రతిక్షణ విజృంభణ, కుచద్వయ రుచులు అంటూ గొల్లలను, వారి స్త్రీలను పరిచయముచేసి చల్లడములతో వెఱ్ఱిగొల్లలైనారురా అని వారి యమాయకత్వమును దెలిపి వారు "చదువు సంధ్యలు, సౌఖ్యములు సుంతయు" లేని వారనియు, 'నాగరికతా జాతి' వారిమేదో మాంసముల పైన 'తాజాగా' తమ 'సౌఖ్య' సౌధాలు గట్టినది. అని నాగరికులు వారినెట్లు తమ స్వార్థమునకుబలి పశువుగా జేయుచున్నారో చక్కగా చెప్పినారు.

'రంగు రంగుల గుడ్డలు' ధరించి, పులి తోలు గట్టుకొని 'చత్రీ' పట్టుకొని 'చేధక్క చెంగలింపగ' క్రొత్త బాణి, పాడుకొను 'బుడబుక్కలవాని' కష్ట మంతులేనిదని ఆ కష్టమును విచారించుమని 'కడలేని యవ్వాని కష్టంబు నడుగరా' అంటూ మేఘుని కోరుతాడు.

'చిగురు చెంపలపైని, చెమరు చిత్తడి తుడువ 'పూలమ్మ బయకారుల' రూపమును వారిచూపులను దెలిపి, బజారు లూడ్చు మాలెతలను గూర్చి ప్రస్తావించుచు 'తడబాటు నడలతో, నడుము కిటకిటలాడ మాలెతలు పేటలను ఊడ్చుచుండేరూ, గూటికై వాపోవువారూ' అంటూ పలికి వారి జీవితములు వర్ణించి, వారు గూడులేని వారనియు, వారికి నీ

నీడన చోటిమ్మని 'ఒక గడియ నీ నీడ లాలికించు' వారిపై అనికోరి, మనుజుడు వారితో పని తీసికొన్నా వారికింత గూడునుగానీ, నీడను గానీ కల్పించు ఆలోచన యెవ్వరిలోనూ కానరాదన్న బాధను వ్యక్తీకరిస్తాడు.

అభిసారికలను వర్ణిస్తూ వారు, 'కొత్తిమిరి కాడలై గుత్తంపు చిఱునవ్వు లత్తమిలగా' 'రేలయం దభిసారికలు' దిరుగుచుందురని, వారియందము లను, జీవితములను మన ముందుంచుతాడు.

మరో చోట పాలు పితుకు గొల్లయిల్లాండ్రను గనిపింపజేసి 'మా కుచము లింతయని' నీకు సూచిం చునటు, చేతులను చెంబులు ధరించి పాలుపితుకు గొల్ల స్త్రీలు కనిపింతురు, వారిని జూచి 'వెఱ్ఱులని పొరబడకు' మని వెలదులకు జాణతనము అచ్చి వచ్చిన విద్యయని వారి సౌందర్యములను వర్ణించి, వారినిజూచి వెఱ్ఱి వారనుకొనకుము. వారు తమ వంపుసొంపులు తెలుపుటకు చూపిం చెడి నెరజాణతనము స్త్రీలకు ఆ విద్య 'అచ్చి వచ్చిన విద్య' అంటాడు.

ఇక ఆరవఖండములో నీటుగత్తెలను జూచి అక్కడే నిలచిపోకుండా, నాప్రియురాలికి, నావర్తమానమును తెల్పుమని మరల తన సందే శాన్ని ఒకసారిజ్ఞప్తికి దెచ్చి 'కోటప్పకొండ' జాతర కువచ్చు నీటుగత్తెలను గూర్చి వారి యందమును గూర్చి వివరిస్తాడు.

తొమ్మిదవఖండములో బ్రాహ్మణులను, వారి జీవిత విధానమును, వారిగొప్పదనమును తెల్పుచూ 'బ్రహ్మతేజస్సుతో వల్లకీ స్వరముతో జట చెప్ప విప్రులున్నారు." కోనసీమలో అంటాడు. "పచ్చ పచ్చగ జెలగి, ముచ్చటల మూటలగు, తీరభూము లందు వేదముల బ్రోవులనగా' బ్రాహ్మణులు వెలసి నారనీ, 'నొసట మూడవకన్ను సరైనహాలాహల మును మ్రింగిరోయష్టతనువులను దిరుగరో'' యని వారి గొప్పతనమును తెలిసికొమ్మంటాడు.

ఆ పిదప దక్షారామములోని యప్సరసల వంటి సానులను పరిచయం చేస్తూ "చరణనూపుర ఝణత్కరణంబు లిరవు'' కొను'సానులనుపేరు ధరియించి'న అప్సరచంద్ర ముఖులను చూపిస్తాడు.

పదవఖండంలో "అతిగాఢరామాఫలావళీ రమ్యమ్ము'',లా కంద వనతుంది లమ్ములనైన మార్గములలో పథికాంగనలను దర్శింపజేస్తాడు. లీలగా నట వాయులీనమై యే ప్రొద్దు గానమ్ము వ్యాహ్యాళి దిరుగూ, పండితుల శాస్త్ర చర్చలలోని మెఱుగూ........అంటూ 'వారసుందరీ తరళదీ'ల లోని మెఱుగులు మెరిపిస్తాడు.

ఈ విధంగా ఈ సందేశ గేయ కావ్యంలో నారాయణాచార్యులవారు 'ఖైదీ' పాత్రలో జీవించి సమకాలిక సాంఘిక రాజకీయ స్థితి గతులను తెలిపి, అచ్చటచ్చట దేశభక్తిని చూపించి తెలుగు నగరాలకు, నదులకు, పుణ్యక్షేత్రములకు వీరులకు సంబంధించిన ప్రస్తావనలతో పాటు హరి జనులు, కంకర పగులగొట్టు బాలుడు, కమ్మరివాని కుటుంబము, చాకలిస్త్రీ, కాపు జవరాలు, పాలేరు, ఆడకూలీలు మొ॥ పల్లీయుల జీవితములు, పణ్యాంగనలు, చెంచుకన్నెలు, లంబాడీస్త్రీలు గొల్లలు, బుడబుడుక్కలవాడు, బజారులూడ్చువారు, అభిసారికలు, ఆటవిక స్త్రీలు, పథికాంగనలు, బ్రాహ్మణులు మొదలగువారి కష్టజీవుల దీన గాథలు వర్ణించినారు.

ఇట్లు కావ్యము ప్రేమ సందేశకావ్యమైనను "హృదయము లేని లోకము సుమీ యిది చూపుల పశ్చిమంబుగా నుదయము తూర్పుగా నడచుచుండు సనాతన ధర్మధేనువుల్ పిదికిన పాలు పేదకు లభింపవు 'శ్రీగలవాని యాజ్ఞ'లో బెదవిగదల్ప జాల'రరవింద భవ ప్రముఖామృతాంధసుల్' అని జాషువా గారన్నట్లు ధనివాద దౌర్జన్యమునకు బలి యగునున్న దరిద్రుల కష్టములు దెల్పుచు గ్రామీణ జనజీవనగీతంగా వినిపించింది.

# ద్రావిడ భాషల్లో తొలి సాహిత్యాలు- ఒక పరిశీలన

పి. శివరామి రెడ్డి

'భాష ద్వారా తమకు కలిగిన అనుభవాలను చెప్పడమే సాహిత్యమని' ఆంగ్ల పండితుడు హడ్సన్ అన్నాడు. కాని మాథ్యూ అర్నాల్డ్ 'జీవితాన్ని అద్దంలాగా చూపించడమే సాహిత్య' మంటాడు కనుక సాహిత్య మనేది జీవితాన్ని వివరించడమే కాకుండా ఆ కాలంలో నుండిన ఆరిక సామాజిక మత రాజకీయ పరిసితులను వివరించడం.

ద్రావిడ భాషల్లో మొట్టమొదట తమిళం, తెలుగు, కన్నడం మరియు మలయాళంలో వచ్చిన తొలి సాహిత్యాలను గురించి వివరించడం ఈ వ్యాస సారాంశ

'ద్రవిడ' అనేమాట తమిళ సాహిత్యంలో 'తాయుమానవర్' వ్రాసినపద్యాలలో మొట్టమొదటగా కనిపిస్తుంది. మరియు లోకయాత్రికులు వ్రాసిన పుస్తకాలద్వారా దక్షిణ తమిళ దేశాన్ని 'ద్రావిడం' అనుట తెలుస్తున్నది. క్రీ.శ. 23 నుండి 79 వరకు ఉండిన ప్లినీ 'దార్దే' అనే పదాన్ని దక్షిణం లేక ద్రావిడం అనే అర్థంలో వాడినట్లు తెలుస్తున్నది. ఈయనే మరొకచోట వాడిన 'ద్రావిన్' అనే శబ్దానికి 'ద్రవిడ' అనే శబ్దానికి దగ్గర సంబంధం కన్పిస్తుంది. 'పెరిప్లస్' అనే గ్రంథం' క్రీ.శ. 50 నుండి 80 కాలానికి సంబంధించినది. దీనిలో కన్పించే 'డిమెరికా' అనే పదానికి 'ద్రవిడ' అనేది అరమని మనం భావించవచ్చు భూగోళ శాస్త్ర పండితుడైన టాలమి, (క్రీ.శ. 119 నుండి 161 వరకు) తమిళ దేశాన్ని 'లిమిరికి' అనుచున్నాడు. ఈయన విల్లును చేతిలో పట్టుకొని తిరుగుచున్న ద్రావిడకుల ప్రజలను 'తిరిలో' పిలిటాయ్' అని పిలచినట్లు కూడా తెలుస్తున్నది. క్రీ.శ. 629 నుండి 645 కాలమునకు చెందిన 'యువాన్ త్స్యాంగ్' అనే చైనా యాత్రికుడు ద్రవిడ దేశాన్ని తిలోబీడు అని పిలిచాడు. ఈ మాటను ద్రావిడ పండితులు ద్రావిడనాడని, ద్రావిడ దేశమని' అను వాదం చేసారు.

రాబర్టు కాల్ ఖవెల్ తన గ్రంథమైన 'ఏ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ద్రవిడియన్ లాంగ్వేజ్'లో ద్రవిడ అనేమాట సంస్కృత భాషలో ఇంచుమించుగా క్రీ.శ. 7వ శతాబ్దం వరకు వ్యవహారంలో ఉన్నట్లు తెలిపాడు. ఆయన తన గ్రంథములో సంస్కృత భాషలో ప్రముఖ వ్యాకరణ వేత్తయైన కుమారభట్టు తన వ్యాకరణ గ్రంథంలో 'ద్రవిడ-ఆంధ్ర' పదాల్ని వాడినట్లు చెబుతూ క్రీ.శ. 7వ

ఆంధ్రభారతి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం-515003.

శతాబ్దానికి పూర్వం ద్రవిడ భాష ఒకటిగానే ఉండేది. ఆ తర్వాత అది ద్రవిడ-ఆంధ్ర అని రెండు భాగాలుగా విడిపోయిందని వ్రాసాడు.

దక్షిణభారత ద్వీపకల్పపు భాషాకుటుంబంలో కాల్డ్ వెల్ 'ద్రవిడ' అనే మాటను మొట్టమొదట 1856లో వాడినారు. ఆ మాట ఇప్పటివరకూ శాశ్వతంగా ఉంది. మలయాళ, కన్నడ నిఘంటువుల్ని నిర్మించిన విదేశీ పండితుడైన గుండర్ట్ [1872] కిట్టర్ [1894] కూడా కాల్డ్ వెల్ వాడిన ద్రావిడ శబ్దాన్ని వాడుకున్నారు. ఏది ఏమైనప్పటికి దక్షిణప్రాంతాలను ప్రాచీన తమిళదేశం, ద్రవిడ దేశాలుగా పిలవబడినట్లు స్పష్టమవుతుంది.

ద్రావిడ భాషలుగా తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, మొదలైన భాషలు పిలువబడుతున్నవి. వీటిలో మొదటి నాలుగు భాషలు మాత్రమే మౌలిక వ్యవహారంతో పాటు లిపిని కూడా సమకూర్చుకున్నవి. తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ సాహిత్యాలల్లో మొట్టమొదటగా ఆర్ధరూపంలో సాహిత్య స్థితిని సంతరించుకొన్నాయి. తొల్కాప్పియమ్, మహాభారతం, కవిరాజమార్గం, రామచరితముల గురించి చర్చించడం ఈ వ్యాస ఉద్దేశ్యం.

తమిళం:

తమిళంలో ఈనాడు లభిస్తున్న అతిప్రాచీన గ్రంథాలలో తొల్కాప్పియమ్ ప్రముఖమైనది. దీని కర్త 'తొల్కాప్పియర్'. ఈ పేరు ఈయన కులానికి సంబంధించినది. తొల్కాప్పియమ్ ఎళత్తు (అక్షరం) పాల్ (పదం) పొరుళ్ (అర్థం) అను మూడు పెద్ద విభాగాలుగా ఈ గ్రంథం విభజింపబడినది. ఒక్కొక్క విభాగంలో తొమ్మిది చిన్న విభాగాలున్నవి. మొత్తం ఇరవైఏడు చిన్న విభాగాలు ఇందులో కన్పిస్తున్నాయి. మొదటిరెండు విభాగాలు భాషా శాస్త్రానికి సంబంధించినవి. మూడో విభాగం సాహిత్య సిద్ధాంతాలకు సంబంధించినది.

(1) ఎళుత్తుకారమ్ (అక్షరవిభాగం):

ఈ విభాగంతో అక్షరం పుట్టుక నిర్వచనం ఇత్యాది విషయాల్ని ఇప్పటి భాషావేత్తలు ఎలా చెబుతున్నారో 'తొల్కాప్పియర్' ఆ కాలంలోనే నిర్వచించాడు. ఉదాహరణకు అ,ఇ,ఉ,ఎ,ఒ లను గూర్చివివరించి తరువాత దీర్ఘాచ్చులైన ఆ ఈ ఊ ఏ ఐ ఓ ఔ లను చెప్పి చివరలో అన్నింటిని కలిపి 12 అక్షరాలను వివరించాడు. ఈ వివరణ సరిగ్గా నేటి భాషావేత్తల 'మినిమమ్ ఫెయిర్ కాంట్రాస్ట్' విధానాన్ని పోలి యున్నది.

(2) పాల్లధికారం (పదవిభాగం)

ఈ విభాగంలో 'అడిచ్చోళ్' పెయర్చ్చోళ్ వినైచ్చోళ్ ఇడైచ్చోళ్ ఇత్యాది విషయాలతో పాటు పదాంశం, ఉపసర్గ, వాక్యం, సంయుక్తం అర్థ పరిణామాలు మున్నగు విషయాలు వివరింపబడ్డాయి.

(3) పొరుళ్ళదికారం

ఈ విభాగంతో సాహిత్య సిద్ధాంతాలను గూర్చి చెప్పబడింది. ప్రాచీన తమిళ సాహిత్యం 'అగమ్' పురమ్ అనే రెండు విభాగాల్లో వ్రాయబడింది. 'అగమ్' ప్రణయ విషయానికి సంబంధించినది కాగా 'పురమ్' కీర్తి యుద్ధం దాన ధర్మాలకు సంబంధించినది. 'అగమ్' సాహిత్యం కుటుంబానికి పరిమితం కాగా పురమ్ సాహిత్యం దేశానికి సంబంధించినది. అగమ్ కవితల్లో నాయికా నాయకుల పేర్లు చెప్పబడని కారణంగా అవి ఏ కాలానికైనా ఏ దేశానికైనా సరిపోవుచున్నవి.

ఇందులో మొదల్‌పొరుల్ (మూలవస్తువు) కరుప్పొరుల్ (గర్భవస్తువు) ఉరిప్పొరుల్ (సంబంధవస్తువు) అనే మూడు విభాగాలున్నాయి. తొల్కాప్పియర్ ప్రాచీన తమిళదేశాన్ని ఆరు భాగాలుగా విభజించాడు.

అవి 1. కుఱింజి (పర్వతప్రదేశం)
2. ముల్లై (అరణ్యప్రదేశం)
3. మరుదమ్ (మాగాణిప్రదేశం)
4. నెయ్‌దాళ్ (సముద్రప్రదేశం)
5. పాలై (ఎడారిప్రదేశం)

(ఈయన ప్రకారం ఎడారిప్రదేశం అనగా పర్వతం అరణ్యాల నుండి మారినభూమి.)

ఈ ఐదు రకాలైన ప్రదేశాలను కవితకు వస్తువులుగా తీసుకొంటూ ఒక్కొక్క ప్రదేశానికి సంబంధించి మూడురకాలైన అగమ్ కవితలు అనగా ముదళ్ పొరుళ్ కరుప్పొరుళ్ ఉరుప్పొరుళ్ వ్రాయబడాలని ఈయన తన గ్రంథంలో నొక్కి చెప్పాడు.

పురమ్ సాహిత్యం :

పురమ్ సాహిత్యం వెట్చి, కరందై, వంజి, కొంజి, నచ్చి, ఉళింగై, తుంబై, వంగై అనే ఎనిమిది విషయాలకు సంబంధించినది.

1. వెట్చి:-ఆవుల కూటాన్ని దొంగతనంగా

2. కరందై :-తీసుకుపోయిన ఆవులకూటాన్ని వెనక్కి తెచ్చుకోవడం.

3. వంజి:-శత్రువుపైకి సైన్యంతో వెళ్ళడం.

4. కొంజి:-సైన్యాన్ని ఎదిరించి నిలబడడం.

5. నొచ్చి:-గోడచుట్టూకాపలాగా నిలబడడం.

6. ఉళింజై:-కోటను ముట్టడించడం.

7. తుంబై:-నిర్ణయించబడిన స్థలంలో నిలబడడం.

8. వంగై :- యుద్ధవిజేత నుదుట ధరించే ఆభరణం.

తెలుగు భాషలో ప్రప్రథమంగా వచ్చిన సాహిత్యాన్ని గురించి తెలుసుకోవడానికి సరియైన ఆధారాలు లభించలేదు. వేయి సంవత్సరాలకు పూర్వం వచ్చిన సాహిత్యం మాత్రమే మనకు దొరుకుతున్నది. అందువలన తెలుగు భాషలో 'ఆదికవి' అనే బిరుదు నన్నయకు లభిస్తున్నా ఆయన రచనలలోని భాషా పటిష్ఠత, సాహిత్య పటిష్ఠత, శైలిని చూస్తే, ఆయనకు ముందు పలువురు పండితులు ఉండవచ్చునని చెప్పవచ్చు. చాళుక్య రాజుల పాలనలో తెలుగు రాజభాషగా ఉండేది. రాజరాజ నరేంద్రుని కాలంలో (1022–1042) నన్నయ భారతం వ్రాశాడు. నన్నయకు ముందుకాలంలో బౌద్ధమతం నశించి జైనమతం అభివృద్ధి చెందినకాలం లేదా శాసనయుగం అంటారు. ప్రారంభశాసనాలలో తెలుగు పదాలు ఉండినవి. తరువాత తెలుగు కవితలలో శాసనాలు వ్రాయబడినవి. ఎఱ్ఱన నృసింహపురాణం వల్ల మహాభారతకాలమునకు ముందుగానే జైన ఉపకథా గ్రంథాలు ఉండవచ్చునని చెప్పవచ్చు.

తెలుగుభాషలో ప్రస్తుతం నన్నయ భారతం మొదటి సాహిత్యంగా వెలువడినది. ఈయన ఆది, సభా, పర్వాది అరణ్యపర్వంలో సగభాగం మాత్రమే వ్రాశాడు. మిగిలిన భారతం తిక్కన ఎఱ్ఱనలచే పూర్తి చేయబడినది.

1. నన్నయ వ్యాసభారతమును ఆధారముగా మహాభారతమును వ్రాశారు.

2. ఆయన పద్యాలలో ఎక్కువ సంస్కృత పదాలు ఉన్నప్పటికీ చదవడానికి చాలమాధుర్యంగా ఉంటాయి.

3. చంపూశైలిలో వ్రాయబడినది.

4. కొన్ని విషయాలను మూలంలో లేకున్నప్పటికీ తెలుగులో చాలా విశేషంగా నన్నయ వ్రాశాడు.

ఉదాహరణకు:- ద్రౌపదీ స్వయంవరం సంస్కృతంలో వచనంలో ఉంది, కాని నన్నయ పద్యరూపంలో అందమైన వర్ణనం ద్వారా వ్రాశాడు. వైదికధర్మాలను వివరించాడు.

మూలంలోని కొన్ని విషయాలను క్లుప్తంగా చెప్పాడు.

ఉదాహరణకు:- ద్రౌపదిని మానభంగం చేయడం కోసం ఆమెను సభకు తీసుకురమ్మని దుర్యోధనుడు చెప్పుట గాంధారికి కోపము కలిగి తన పుత్రుడని కూడా చూడకుండా ధృతరాష్ట్రుని దేశబహిష్కరణ చేయమని చెప్పడం నన్నయ తన భారతంలో చెప్పకుండా వదిలాడు.

నన్నయ తిక్కన ఎఱ్ఱనలే కాకుండా నన్నెచోడుడు కూడా ప్రారంభకాల సాహిత్యకర్త అని చెప్పవచ్చు. వీరిదృష్టి అంతా సంస్కృత కావ్యాలను తమ దేశ ప్రజల కోసం తెలుగులో వ్రాయడం. తిక్కన మహాభారతంలో ఎక్కువభాగం వ్రాశాడు. అంతేకాక నిర్వచనోత్తర రామాయణం కూడా రచించాడు. ఎఱ్ఱన అరణ్యపర్వంలో సగభాగం హరివంశం, నృసింహ పురాణాలను కూడా రచించాడు.

కాళిదాసు ఉద్భటుల కుమారసంభవం నన్నెచోడుని గ్రంథానికి ఆధారం. ఆయన తనకు ముందున్న పూర్వకవులను అనుసరించకుండా సంస్కృతంలో కాళిదాసు, వాల్మీకి, భారవి, ఉద్భటుడు మొదలైన వారి సంస్కృత సాహిత్యాలను చూపినట్లు తన గ్రంథంలో చెప్పుకున్నాడు. అంతేకాక తన కాలంలో ఉండిన మార్గ-దేశి కవిత్వాలలోని దేశి కవిత్వంలో తన గ్రంథాన్ని వ్రాశాడు. తెలుగులో ఒక క్రొత్త సాహిత్యపద్ధతిని నన్నెచోడుడు సృష్టించాడని చెప్పవచ్చు.

కన్నడం:

కన్నడ సాహిత్య చరిత్రలో మొదటి స్థానం కవిరాజమార్గం / అనే వ్యాకరణ గ్రంథానికి లభిస్తుంది. ఇది 9వ శతాబ్దంలో వ్రాయబడింది. ఇది కేవలం ఒక అనువాదమే కాక భారతదేశమునకు చెందిన విషయాలను వివరిస్తుంది. అందువలన సంస్కృత కన్నడ భాషలకు 'కవిరాజమార్గం' ఒకసేతువులాగా ఉంది. కవిరాజమార్గ రచయిత 'నృపతుంగన్'(820—877). కాని కొందరు ఆయన సభలో ప్రధానకవిగా ఉండినశ్రీవిజయుడు లేదా కవీశ్వరుడు దీనినిరచించినట్లు అభిప్రాయద్దారు. ఇంకా కొందరు శ్రీవిజయుడు అనే ప్రాచీన కవివ్రాసిన కవిరాజమార్గ గ్రంథాన్ని 'నృపుంగన్' ఆస్థానకవియైన 'కవీశ్వరుడు' అభివృద్ధి చేశాడంటాడు. ఏది ఏమైనా జైనకవి శ్రీవిజయుడు కవిరాజ మార్గమును వ్రాసి ఉండవచ్చునని చెప్పవచ్చు.

ఈ వ్యాకరణ గ్రంథం మూడు పరిచ్ఛేదాలుగా వ్రాయబడినది. మొదటి పరిచ్ఛేదంలో కన్నడ దేశ నేల, ఊరు రాజధాని ప్రజల ఆచారాలు,విద్య, పాండిత్యం మొదలైన వాటికి సంబంధించిన వివరాలు కన్పిస్తున్నాయి. ఇందువల్ల రచయిత భాషాభిమానం తెలుస్తుంది. పైగా ప్రాచీనకాలంలో పెదండె, సత్తానా కీఅను రెండురకాల ఛందస్సును కూడా వాడినట్లు తెలుస్తుంది.

మొదటి పరిచ్ఛేదంలో క్రింది విషయాలున్నాయి.

1. ప్రాచీన కన్నడశైలిలో వ్రాసిన కవితను చదివి ఆనందించడం ముసలి స్త్రీ సంబంధం లాంటిది.

2. కన్నడంను సంస్కృతంలో కలిపి చెప్పడం చెవికి చేదు లాంటిది.

3. కాని కన్నడ భాషకు సమానంగా సంస్కృత భాషను కలపడం స్వరకల్పనవలె చెవికి మాధుర్యం కల్గిస్తుంది.

4. మిశ్రమ పదాలుగా కన్నడంలో సంస్కృతం కలపడం కాగుతున్న వేడిపాలలో మజ్జిగబిందువును వేసినట్లు అవుతుంది.

మొదలైన విషయాలు మొదటి పరిచ్ఛేదంలో కన్పిస్తున్నాయి.

రెండవ పరిచ్ఛేదంలో సగభాగం మూలమును ఆధారంగా చేసికొని వ్రాయబడినది. ఇందులో యతి ప్రాసలు మున్నగు విషయాంశాలున్నాయి. అక్కడక్కడ అర్థంకాని పదాలు కన్పిస్తున్నాయి.

ఉదాహరణకు : అంద్యె, మత్తె

మూడవ పరిచ్ఛేదంలో అలంకారాల గురించి చాలా స్పష్టంగా చెప్పడం జరిగింది. దండి ఎనిమిది అలంకారాల గురించి మాత్రమే చెప్పగా కవిరాజ మార్గ రచయిత ఒక అడుగు ముందుకు వేసి తొమ్మిది అలంకారాలను గురించి చెప్పాడు. దండి చెప్పలేని ధ్వనిని ఈయన పరిచయం చేశాడు.

కవిరాజ మార్గం కన్నడంలో వచ్చిన మొదటి గ్రంథమైనప్పటికీ దానికి ముందుగా కొన్ని శతాబ్దాల పూర్వమే కన్నడ సాహిత్యం చాలా ప్రశస్తిని పొందిందని ఈ గ్రంథంద్వారా తెలుస్తుంది. ఈ వ్యాకరణ గ్రంథం 'హల్మిడి' శాసనానికి క్రీ.శ. 450—90 వ శ॥ మధ్యకాలమునకు చెందినదిగా ఉండవచ్చు. కవిరాజ మార్గ రచయిత తనకు ముందుగా ఉండిన పలువురు కవులను గురించి తన గ్రంథంలో చెప్పాడు. విమల, ఉదయ, నాగార్జున దుర్వినాదున్ మొదలైన వచన రచయితలు మరియు గేయాలు వ్రాసిన శ్రీవిజయ, కవీశ్వర, పండిత, చంద్ర, లోకబాల మొదలైన వారిని గూర్చి చెప్పాడు. వారిలో దుర్వినాదున్ గంగరాజుగా ఉండవచ్చునని, పల్లవరాజు అయిన ఈయన విష్ణుభక్తుడని కొందరంటారు. ఈయన భారవి వ్రాసిన 'కిరాతార్జునీయం'లోని 15వ సర్గకు భావం వ్రాశాడు. సంస్కృతంలో మంచి పాండిత్య కలవాడు.

అంతేకాకుండా వీరిని గురించి చెప్పినపుడు 'దుర్వినిదాదిగళ్' లోకపాలాదిగళ్, అని చెప్పినందువల్ల వీరివలె ఇంకా కొందరు పండితులు కూడా ఉన్నారని చెప్పవచ్చు. పురాణ కవిగళ్ పూర్వాచార్యులు అనే పదాలు కూడా కవిరాజ మార్గంలో కన్పిస్తున్నాయి. పైగా ఉదాహరణ పాటలు కన్నడ రామాయణం మరియు భారతం నుంచి చెప్పడం వల్ల ముందుకాలం నాటి సాహిత్య పరిస్థితికూడా తెలుస్తుంది. ఇది కన్నడ భాషకు చెందిన దేశీయ ఛందస్సులో వ్రాయబడినది.

మలయాళం :

ప్రాచీన కాలంనాటి మలయాళంలో సరియైన గ్రంథం దొరకలేదు. రాజులు మరియు ప్రజల మధ్య స్వచ్ఛమైన తమిళం వాడుకతో ఉండినది. గేయ సాహిత్యమైన 'రామచరితం' మాత్రమే చాలా ముందుకాలంలో వచ్చినది. ఇది 12వ శతాబ్దానికి చెందినది. ప్రప్రథమంగా వచ్చిన మలయాళ

సాహిత్యం తమిళ సంస్కారాలతో కలిసి ఉండేది. అంతకు ముందు 12వ శతాబ్దం వరకూ జానపద రూపంలో ఇది ఉండినట్లు కనిపిస్తుంది.

రామచరితం నూట అరవై నాలుగు పరిచ్ఛేదాలుగా ఉంది. ప్రతి పరిచ్ఛేదంలో పదకొండు పద్యాలు ఉన్నాయి. అరుదుగా కొన్నిచోట్ల 10, 14 పద్యాలున్నట్లు కూడా తెలుస్తుంది. యతిప్రాస మొదలైన విషయాలు కనిపిస్తున్నాయి. ఈ గ్రంథంలో రామాయణం గురించి పూర్తిగా వివరింప బడలేదు. రావణుని మరణం, యుద్ధకాండ వృత్తాంతాలు మాత్రమే కావ్యాంశాలుగా ఉన్నాయి. ప్రాచీన పద్ధతులను వాడినట్లు తెలుస్తుంది. దానిపై తమిళ కంబ రామాయణ ప్రభావం ఉన్నట్లు కనిపిస్తుంది.

ఇవి నయనారులు. ఆళ్వారుల (శైవపద్యాలు, వైష్ణవ పద్యాలు) పదిక, పాశురం పద్ధతిలో ఉన్నాయి. వృత్తచందస్సుకూడా ఉన్నట్లుతెలుస్తుంది. కంబ మహాకవివలె రామచరితం వ్రాసిన కర్త రాముని విష్ణు అవతారంగా పేర్కొన్నాడు. వాల్మీకి రామాయణం మూలాధారమైనప్పటికి తమిళ రామాయణం ప్రజాదరణ పొందినందున తమిళ రామాయణ ప్రభావం 'రామ చరితం' పై ఎక్కువగా కన్పిస్తుంది. ఇది మళయాళంలో చాలా ప్రాచీనమైనప్పటికి మత ప్రభావం ఆ కాలమందలి ప్రజల జీవితాన్ని ఆర్థిక పరిస్థితిని క్లుప్తంగా వివరిస్తున్నది.

# కవితావీథి

## పంచవ

మూలం :
మైథిలీ శరణ్ గుప్త

అనువాదం :
ఈమని దయానంద

పెదవి విరచె నొయారముగ
ముదిత ప్రేమ నొలకబోసి
సుస్మితుడై లక్ష్మణుడనె
'స్రుక్కించకు ముచ్చువేసి

నీ వనుపమ భాగ్యవతివి
నేనో, కడు దరిద్రుడను
ఆతిథ్య మ్మేమిత్తును?
అందులకే లజితుడను.'

అతివ యిట్లు బలికె మరల
'అర్థమయ్యె నీ భావము
అమరులైన పొందలేరు
ఆ విధి నీ కిడిన ధనము

అయినను బైరాగి వోలె
అగుపింతువు త్యాగశీలి!
అనుపమ రత్నాభరణము
లర్పింతును భాగ్యశాలి!

భోగమ్ములకై నీ వలె
యోగముద్ర ధరియింతును
ఎన్ని విఘ్నబాధలైన
యిట్టే తుదముట్టింతును.

ఏ కోరిక సిద్ధించగ
నీ వ్రతమును సాగింతువు?
నా సామర్థ్యమ్ము చేత
నన్నియు నాస్వాదింతువు

ధనాపేక్ష గల్గిన నా
ధరణి యెల్ల స్వర్ణమయము
ఈ వైరాగ్యమును విడచి
ఏలికవై పాలించుము

దుర్జయ శాత్రవ వీరుల
నిర్జింపగ దలతువేని
చెప్పుము నా క్రోధాగ్నికి
చేసెద బలిగా వారిని,

తాళలేక ప్రేమతృష్ణ
తపోకూపమేల త్రవ్వ?
ఎంత అమాయకుడ వీవు
యీ రీతిగ మిగుల నొవ్వ?

ఈ యౌవన ధనము జూచి
ఏ జవ్వని ప్రాణమిడదు?
వ్యర్థము గానీక వయసు
సార్థక మొనరింపు మనుదు!

---

తూర్పుపాలెం ఒంగోలు

# వసంతాగమనము

కె. నరసింహమూర్తి

పాత వలువలు విడిచి ప్రకృతి
నవ దుకూలము దాల్చు చుండగ
క్రొం జివుళ్ళను మేసి కోయిల
కుహూకుహూ యని పాడుచుండగ

వరభృతమ్ముల గానమును విని
జగతి యంతయు పరవశించగ
మావి పూతల వ్రాలి తుమ్మెద
మాటి మాటికి రొదలు జేయగ

భాస్కరుడు తన వాడికరముల
దాపి జగముల మోదు చుండగ
మృగ తృష్ణలను మృగములన్నీ
జలములనుకొని పరుగు దీయగ

అనల దేవుని పాదు వనులకు
అనిల దేవుడు తోడు పడగా
అహములేమో ఆయతములై
నిశలు మాత్రం కృశత బొందగ

ఇక్షు ధనువును దాల్చి మదనుడు
కుసుమ శరములు వదలు చుండగ
హిమకరుని శుభాగమనమునకు
రేల మిథునము లెదురు చూడగ

శిశిరమును ఇక చాలు పొమ్మని
వసంత రాజదె అరుగుదెంచెను.

ప్రెస్టన్ ఉన్నత పాఠశాల, జనగామ-506167, జి॥ వరంగల్.

# వసంతం ఒక ఒయాసిస్సు

పైలా కృష్ణారావు

నిరాశల నిదాఘ తాపానికి
ఆశయాల జలాశయాలు శోషిల్లినపుడు
వైఫల్యాల ఝంఝా మారుతాహతికి
కడగండ్ల వడగండ్ల వానల్లో భీతిల్లినపుడు
అన్నార్తుల మనసుల్లో వికసించే ఆశ లాకాశ కుసుమాలు,
అన్నదాతల కన్నుల్లో విరబూసే అభిలాషల వరివెన్నులు,
జీవన ప్రాంగణంలో కురిసే శరజ్జ్యోత్స్నా శీకరాలు,
ఒక కొంత ఉపశమనం
నిట్టూర్పుల దట్టమైన మంచుతెరలు కమ్ముకొని
నెత్తురు చల్లబడి తనువు వెలవెల బోయినపుడు,
తీరం చేరని అలల్లాంటి కోర్కెలు
జీర్ణ తరు పర్ణాల్లా రాలి బతుకు మోడువారినపుడు,
ఆదర్శాల కుదుళ్ళలో లేచిన కొత్త ఆశల చివుళ్ళతో
నవభావాల నెత్తావులు చిమ్మిన జీవన సుమ పరాగాలతో
విరిసిన వసంతోదయ ఉషస్సు
బతుకు ఎడారి పయనంలో ఒక ఒయాసిస్సు.

తెలుగు లెక్చరర్. వీరభద్రపురం, శ్రీకాకుళం.జిల్లా.

# అభివ్యక్తి

— యస్.యస్.రెడ్డి

అభిరుచి హరివిల్లు విరిస్తే
అభివ్యక్తి విరిజల్లు కురుస్తుంది
అభివ్యక్తికోసం సృష్టి
ఆరాట పడుతుంది
అభివ్యక్తి జీవితంపై
ఆసక్తిని పెంపొందిస్తుంది
కోయిల కుహూ మంటుంది
వసంతం వాకిటనే వుందని
మేఘాలు గర్జిస్తాయి
వర్షాసుందరి ముస్తాబు అయిందని
మాటలలో పెగలని
వచ్చని అభిప్రాయాలు
మౌనంలో చిగురిస్తాయి
ప్రగాఢ వేదనాంకురాలు
కుంచె కుదింపుతో
ఆకృతులుగా పొదసూపుతాయి

గడ్డకట్టిన వ్యాసంగాలు
వేణు రవళితో కరిగి ప్రవహిస్తాయి
అవ్యక్త ఆలోచనా స్వరాలు
నృత్యారామం దర్శించినపుడు
రెక్కలు విప్పి ఎగురుతాయి।
తొలకరి అభివ్యక్తి
పుడమి జలదరింపు
తొనల అభివ్యక్తి
రుచుల ప్రసక్తి
ప్రకృతిశక్తి
పారదర్శక అభివ్యక్తి.
ఆత్మ అభివ్యక్తి
ఆరాధనా రక్తి
పిపాస స్ఫూర్తి
కళాభివ్యక్తి !

సీనియర్ ఆడిటర్, పిఎన్‌టి ఆడిట్ విభాగం, హైదరాబాదు.

# పాటనూ-గొంతునూ మార్చిన కోకిలమ్మా

డా॥ దమ్ము శ్రీనివాసబాబు

కోకిల రంగుఉన్న కోకిల
గొంతుమార్చి పాడుతోంది
రాజకీయం బాగా నేర్చుకున్నట్టుంది.

కోకిల తల్లి తండ్రులు
స్వార్థానికి మారురూపాలు
బాధ్యతా రాహిత్యానికి ప్రతీకలు.

కాకపోతే ఆడకోకిల తన గుడ్లను
కాకుల గుడ్లలో కలపడ మేమిటి?
మగ కోకిలేమో తనకేమీ పట్టనట్టు
బాధ్యత లేకుండా తిరగడ మేమిటి?

ఇంతటి స్వార్థ పరులైన
తల్లి తండ్రుల కడుపున పుట్టిన
పరాయి యింట పొదగబడి పెరిగిన
కోకిల గొంతంటే
అందరము పడిచస్తాం
తెలియని ఆనందంతో
గంతులు వేస్తాం.

ఆ రోజుల్లో ఆ పాటకు
వసంతకాలం తన్మయత్వం చెందేది.

లేత మామిడి చిగుళ్ళు
రకరకాల పూలు,తీగలు
ఒక టేమిటి?
ప్రకృతి నంతా పులకరించేలా
చేసేది ఆ పాట

ఆ కోకిలమ్మ పాటలో
సత్యం, శివం, సుందరం
ఆధ్యాత్మిక తత్వం।
నీతి, నిజాయితి, ప్రేమ
సున్నితత్వం, తీయదనం.
ఎన్నెన్ని భావాలో!
ఎన్నెన్ని రాగాలో!!

యిప్పుడు గొంతు మార్చిన
కోకిలమ్మ పాటలో
హింస ప్రజ్వరిల్లుతోంది
స్వార్థం పడగ విప్పి
కోడెత్రాచులా బుసలు కొడుతోంది
కులమత వర్గ విభేదాల మత్తును
నషాలాని కంటిస్తోంది
ఉగ్రవాదం వెర్రి తలలు వేస్తూ

1-9-52/42, రాంనగర్, హైదరాబాదు-500 048.

మానవత్వాన్ని మంట కలుపుతోంది.
లోకులు పలుకాకులు అనడం
మాట వరసకే అయింది పరిమితం
కాకుల్లో ఉన్న ఐకమత్యం మాత్రం
మానేసిండ కనిపించడం.
కాకుల గుంపుల్లో కోకిల బ్రతక లేదు
కాకులు
తమలా కనిపించే కోకిలను
గొంతు విప్పనంత వరకే
తమతో మెలగ నిస్తాయి
కోకిల గొంతు విప్పిందా
జాతి భేదం తెలుస్తుంది.
గొంతు విప్పిన కోకిల
తన గాన మాధుర్యాన్ని
లోకానికి వినిపిద్దామనుకున్న కోకిల
కాకుల దాడికి గురి అవుతుంది
అందుకే నేమో కోకిల
గొంతు మార్చింది పాటా మార్చింది.
మానవత్వానికి పట్టం కట్టాలన్నా
నీతి నిజాయితీలు కలకాలం నిలవాలన్నా
మనిషిలోని దోచుకునే గుణాన్ని
దూరంగా తరిమేయాలని ఉన్నా
హింసా ప్రవృత్తిని మానుకోవాలన్నా
ప్రపంచ మానవాళిలో
శాంతి కాముకత్వాన్ని కావాలని కోరుకున్నా.
కాకుల్లోని ఐకమత్యం
కోకిల గొంతులోని తీయదనం
యీనాడు సమాజానికి కావాలి
యీ మనుషుల్లో రావాలి
ఆ మార్పును యీ పండుగ తేవాలి.

# వ్యథాగీతం

పాతూరి రఘురామయ్య

నాకు అంతం లేనట్లే బాధకు రూపంలేదు
భగ్న మనస్సుకు తెలియదు శుచి, లేదు రుచి
వికట స్వప్న తరంగం వలె తెగిపడిన గాలిపటం.
కపట నాటికల తతంగంవలె మెరిసిపోయే ఖాళి శకటం.
రిక్త హస్తాల్లో మెరిసిపోయే కాయితాలు 'పట్టా'లే
అశ్రుసిక్తమైన గుండెల్లో కాలిపోయేను జీవితాలు–
బాధ లేనిదేదీ మనిషి కాదు-
పూర్వజన్మలోంచి తెచ్చుకున్న ప్రజెంటేషన్ బాధ !
నావెంటా-ప్రతి జీవి వెంటా-
పడగెత్తిన బాధా సర్పం- బుసలుకొడుతూ
విషం కక్కుతూ వెంబడించేను
ఈ బాధా సర్పాన్ని ఎలా త్రోసివేయడం?
ఓ సుదూర తీర నివాసివైన పరమాత్మా
ఓ నాలో ఎక్కడో దాగిన లోలోపలి వెలుగుమూర్తీ !
బాధే జీవితమా !? బాధే నేస్తమా ?
బాధను త్యజించిన త్యాగమూర్తి ఎక్కడున్నాడు ?
ఇక్కడ ఎక్కడా లేదు బాధను వరించని ప్రేమమూర్తి
మంత్రమయమైన వాక్ సుధావర్షం కురిసే మనోమేఘాల్లో
అఖండ జీవన జ్యోతి రూపం బాధ!
అనాహత జీవన గీతికా నాదం బాధ !
అశ్రువుల్లోంచి ఆవిర్భవించిన శ్లోకం
పుణ్యం పొందిన దివ్యమూర్తియై
స్వర్గానికి రాచబాటలు వేసింది.
బాధ మన చేతుల్లో పొందనిరూపంలేదు
బాధ వేయని వేషమే లేదు మన ఊహల్లో
బాధ మన నడకగా మారని క్షణం లేదు
బాధ వినా ఎవరి కథైనా అహృద్యం

రుద్రంగి పోస్టు: సహకార కళాశాల, కరీంనగర్ జిల్లా.

బాధ కావ్యవేదులైన వారికి నైవేద్యం
బాధ తెలియని బండరాయికిది చోద్యం
ఎన్ని రూపాల్లోకి ఇమిడి పోయినా బాధ ఉనికి పోదు!
బాధకు బోధ బంధువే కావచ్చు
బాధను తుడిచేబోధన పరమరమ్యమైన
అకలుష జీవనరేఖా చిత్రమే కావచ్చు
రోషం లేనే లేదు. ఎవరి మీదా
పరిహాస భాసురత్వం లేనే లేదు—ఎవరి లోనూ
జ్ఞాన ప్రకాశ మార్గంలో నే నొక యాత్రికుడిని
సుస్వర మంత్ర మహితాశ్రు నవవేదం
అశ్రుయజ్ఞోద్భవ నవకవితా సుమపాదం
నీలో నాలో అందరిలో వినబడే నవనవనాదం
కవిత్వం ఇప్పుడు కరక్కాయ కాదు-తేనెధార
బాహా మహితమైన ప్రతిభావ శిఖరమూ
అద్భుత నవకావ్యరాజమే ' అఖండ కవితా ప్రబంధమే,
హృదయ సాగరపు టంచుల్ని పెంచుకొన్న మనోవేదన
సుస్వర మంత్ర మహితాశ్రునవవేదం
అశ్రుయజ్ఞోద్భవ నవకవిత్వపు చిరుదీపం
కాలాన్ని తెంచుకొన్న సృజనా మధు కిరణం
మేధోవరి బాగాన నిలచిన మమతా ధనం
మృదు హృదయ వ్యథా విదళన నవమనీషి రాకకొరకు
వేచివేచి యుగాలు గడచిపోయింది, ఇక రాడేమో?!
ఆ ఉద్ధారకుడు! ఆ ప్రజాసంస్కర్త! ఆ ప్రయోగాత్మక కళాశీలి!
ఎవరొస్తారో ఈ అశ్రునేత్రాలు చూడకపోతాయా?!
అశ్రువుల్ని ప్రపంచసారంగా ధృవీకరించుకొని
బాధను వేయింతలుగా మనోభూమికలో స్థిరీకరించుకొని
నాలో నేను! అశ్రుయజ్ఞ మంటపాన,
బాధా సలిలం సేవించి కలలుకంటున్నాను!
ఒక్కొక్క కల శ్రీకర కళావిన్యాస వర్షఘట్టం!
ఈ ప్రపంచ నాటకంలో మన జీవనంలో కటకట!
నిష్కపట వికటీకృత ఏకాంకిక! నిరుత్సాహానికి పర్యంకిక!

# క్షుధాగాథము

జి. శ్రీశైలం

పొట్ట ధాన్యరాసులను మింగేస్తూ
కనబడని మహాకడలిలా ఉంటుంది
అవకతవక జరిగిందో
అలలతో నింపుకునే కేకలతో
సౌమ్యసిల్లేలా హోరెత్తిపోతుంది
వెలితికలిగిన ఆకలి సముద్రా లెన్నెన్నో
మనదేశంలో ఉన్నాయి
అవినీతి వరులవల్ల
చోరరాజకీయ నాయకులవల్ల
అశాంతితో ప్రజ్వరిల్లుతున్నాయి
ఆ దుండుగుల ప్రభావాన్ని
అతిక్రమించిన నాడే
అవి శాంతబడుతాయి.

# కథావీధి

తెలుగు కథానిక

## జీవిత లక్ష్యం

గోవాడ వెంకటరావు

ఏప్రిల్ నెల రోజులవి. ప్రతి కళాశాలలోనూ పరీక్షల హడావుడి. చివరి పరీక్ష వ్రాయగానే నీవు ఎలా వ్రాశావు? నీవు ఎలా వ్రాశావు? అని ఒకరి నొకరు అడిగి తెలుసుకుంటున్నారు విద్యార్థులు.

శశిధర్ పరీక్ష వ్రాసి బయటకు వచ్చి నిలబడి తన మిత్రుడు రఘు కోసం చూస్తున్నాడు. ఇంతలో ఒక సహ విద్యార్థి ''ఏం! ఎలా వ్రాశావు'' అన్నాడు హుషారుగా.

ఆ...బాగా వ్రాశాను అన్నాడు శశి.

రఘు వస్తున్నాడు. రఘు వస్తుండగానే నువ్వెలా వ్రాశావు అంటే నువ్వెలా వ్రాశావు అన్న అవే ప్రశ్నలు వారిద్దరి ముఖాలనుండి పెదాలు కదుపకనే వెలువడ్డాయి. అలాగే సమాధానాలు తడబాటు లేకుండా బాగా వ్రాశాను అంటే బాగా వ్రాశాను అని వెలువడ్డాయి. వెంటనే శశి రఘును ''మీ గదిలోనే కదా కిరణ్ పరీక్ష కూడా. ఏడీ? ఇంకా వ్రాస్తున్నాడా?' అన్నాడు. అవునన్నట్లుగా తలవూపి రఘు కూడా ఆశగా చూడసాగాడు కిరణ్ రాక వైపు.

కిరణ్ కుమార్ నిజానికి శశి, రఘు కున్నంత చురుకు చదువు విషయంలో తనకు లేకపోవటం వల్ల ఆ విషయంలో మాత్రం వారితో అంతగా కలువలేకపోయేవాడు.

చూస్తుండగానే కిరణ్ రానే వచ్చాడు. ఏం కిరణ్ ఎలా వ్రాశావు ఏక కంఠంతో అడిగారు శశి, రఘులు.

బాగానే వ్రాశాను, ఫర్వాలేదు—సమాధానం ఇచ్చాడు కిరణ్

వారి ముగ్గురికి ఆ కళాశాలలో చదివిన మూడు సంవత్సరాలలో ఎంతో గట్టి సాన్నిహిత్యం ఏర్పడింది, నిజానికి అంతకుముందు ఒకరినొకరు ఏ మాత్రం యెరుగరు. కేవలం ఆ డిగ్రీ చదివే టప్పుడే వారు ముగ్గురూ ఎవరు ఏపని చేయాలన్నా, ఎవరు ఎక్కడికి వెళ్లాలన్నా, మిగిలిన యిద్దరి తోడు సలహా, సహాయం తప్పక కోరుకునేవారు. ఇంత గాఢమైన మిత్రత్వం కలిగిన వారి ముగ్గురిలో కిరణ్ చదువులోనే కాకుండా కొన్ని విషయాల్లో తప్పని సరయి వేరుగా వుండేవాడు.

ప్రేమ్‌నగర్, ఖైరతాబాదు, హైదరాబాదు,

అతడు ఆ విధమైన అల్ప భిన్నత్వం కలిగి వున్నాడని ఆ ముగ్గురికి తెలుసు.

ముఖ్యంగా కిరణ్ ను కాలేజీ రోజుల్లో వారితో విడిగా వుంచే విషయాలు చెడు అలవాట్లు. కిరణ్ ఒక డిగ్రీ చదువుతూ సమాజంలోని తన స్థానాన్నీ, అలాగే ఒక సామాన్య మానవుడికి ఉండవలసిన స్థానాన్నీ, సమాజంలో గౌరవ-ప్రతిష్టలూ, మంచి-చెడులూ, తెలియజెప్పే విషయాలనూ క్షుణ్ణంగా తెలుసుకునే సమయంలో చిత్తశుద్ధిని కోల్పోయి, కొన్ని చెడు ప్రభావాల ద్వారా చెడు అలవాట్లకు లోనయినాడు. కిరణ్ ఒకటి రెండు సార్లు సిగరెట్లు కాల్చడం, అలాగే ఫంక్షన్ల వద్ద తక్కువ మోతాదులో మత్తుపానీయం సేవించడం రఘు, శశింకు తెలియడమే కాక కొన్నిసార్లు వారు కూడా చూడడం సంభవించింది.

'అలవాటనేది మానవ సహజం. ఆ అలవాటు చెడుదయినపుడు, మనిషి మంచి చెడులను తెలుసుకోగలిగిన గొప్ప గుణమును కలిగిన వాడు కాబట్టి దాని జోలికే పోడు. నిజానికి మొదట్లో సరదాకి ఒక్కసారి హుందా కోసం కాల్చి చూద్దాం లేక త్రాగి తద్వారా అంత వరకూ ఊహలకందని సుఖాన్ని అనుభవిద్దాం అని అనిపిస్తుంది. కానీ, మనిషి జీవితం ఎత్తు, పల్లాలతో కూడినది. జీవితమంతా మానసిక సుఖంతో బ్రతుక గలిగే అదృష్టవంతులు బహు స్వల్పం. ఆ మానసిక సుఖం మనిషికి ఏ చిన్న సమస్య వచ్చినా దూరం అవడం జరిగి. తద్వారా అంతకు ముందు హుందా కోసం చేసుకున్న అలవాట్లకు మనిషి బానిసయిపోతాడు' అని శశి, రఘులు సంయుక్తంగా కిరణ్ కి నచ్చజెప్పచూశారు. కాని, కిరణ్ కు అది వంటబట్టలేదు.

చూస్తూ, చూస్తూ కాలం గడచిపోయింది. ముగ్గురూ కళాశాల చదువును పూర్తి చేసుకోగలిగారు. కళాశాల చదువునే అంతంత మాత్రంగా పూర్తిచేయగలిగిన కిరణ్ పైచదువులపై శ్రద్ధ చూపించలేకపోయాడు. శశి, రఘులు మాత్రం తమకు అభిరుచి గల తరువాతి చదువులను కొద్ది మేర చదువగలిగి ఒక స్థాయి విద్యావంతులవగలిగారు.

వారి ముగ్గురి ఇళ్ళలో ఏవరింటిలో ఏ చిన్న శుభ కార్యమయినా, లేక ఎవరింట్లో ఏ విధమయిన బాధగలిగినా ముగ్గురూ ఆ యింటిలోని అన్నదమ్ములవలె ఆ కష్టాన్నిగానీ, ఆ ఆనందాన్నిగానీ పంచుకోవడం వారికి అలవాటయిపోయింది.

శశిధర్ తాను చదివిన మంచి చదువుల ద్వారా మరియు తాను పెంచుకున్న సాంకేతిక విజ్ఞానం ద్వారా మంచి కంపెనీలో మేనేజర్‌గా ఉద్యోగం సంపాదించగలిగినాడు. అదే విధంగా కిరణ్ కొద్ది గొప్ప రెకమండేషన్ చేయించగలిగి ప్రభుత్వ కార్యాలయములో క్లర్క్ ఉద్యోగం సంపాదించగలిగినాడు. ఇక పోతే రఘు మంచి ఉన్నత స్థానం గలిగిన అత్త, మామలకు అల్లుడయినందున మామగారి కంపెనీలో వాటా పొందగలిగినాడు.

ముగ్గురి జీవితంలో యాంత్రికత చోటుచేసుకుంది. జీవితంలోని మధ్యస్థానానికి వచ్చిన వారు ముగ్గురూ వారి, వారి పనులలో మునిగిపోయి మిత్రత్వానికి అప్రయత్నంగా తాత్కాలికంగా దూరమయ్యారు. నిజానికి అందుకు కారణం వారు వారి,వారి ఉద్యోగార్థమయితేనేమి, జీవిత స్థిరత్వం కొరకయితే నేమి వేరు వేరు ప్రదేశాలలో నివసించడం.

కిరణ్ జీవితంలో చేసుకోకూడని అలవాట్లే చేసుకున్నాడు. ఆ అలవాట్లకు అతడు బానిసయి పోయాడు. చదువుకునే రోజుల్లో మూర్ఖంగా ఎదుటివారి ముందు గొప్ప కోసం. మంచి చెప్పే వారి మాటలను లెక్క చేయకుండా చేసుకున్న అలవాట్లు ఈ రోజు కిరణ్ జీవితలక్ష్యాన్నే తప్పిం చేవిగా తయారయినవి.

కిరణ్‌కు చిన్నప్పటి నుండి తల్లిగానూ, తండ్రిగానూ బాధ్యత వహిస్తున్న కిరణ్ తండ్రి పోయి నాలుగు సంవత్సరాలయింది. నిజానికి కిరణ్ తండ్రి యిచ్చిన గారాబాన్ని అలుసుగాతీసు కొని గారాబం ద్వారా గౌరవం అనే పదాన్ని మర్చిపోయి తండ్రి మాటలు వినక చెడు దారులు త్రొక్కాడు.

అప్పటికి కిరణ్ భార్య హఠాన్మరణం పొంది సుమారు తొమ్మిది నెలలయింది. కిరణ్‌కు ముచ్చ టగా ఇద్దరు పిల్లలు, ఒకపాప, ఒక బాబు.

కిరణ్ రాత్రింబవళ్ళు తేడా తెలియకుండా త్రాగడం మొదలు పెట్టాడు. అంతకన్నా బాధకు విరుగుడుగా మత్తును పంచియిచ్చే త్రాగుడే అతనికి రాత్రింబవళ్ళు తెలియకుండా చేసింది. సమయానికి పిల్లలు కూడా తాతగారింట్లో ఉన్నారాయె.

ఇక కిరణ్ బాధకు హద్దులేకపోయింది. అతను పిల్లల గురించి ఆలోచించలేకపోయాడు. అతనిలో జీవితంపట్ల ఏవగింపు ప్రారంభమయింది. జీవితమంటే ఏమిటో తెలుసుకోలేక పోతున్నాడు. జీవితంలో ఎత్తుపల్లాలు సహజమనీ, వాటిలో పల్లాలు మరీ ఎక్కువనీ గ్రహించలేక పోతున్నాడు. అతడి మనసు ఈ లోకంలోని మానసిక రుగ్మతలకు దూరంగా ఉండమని నొక్కి, నొక్కి వక్కాణిస్తు న్నది. ఈ విధంగా అంతః వ్యథనలు పడుతున్న తనకు జీవితం వ్యర్థం అనిపించి తాత్కాలికంగా జీవిత బంధాలనుండి దూరంగా ఉంచే వ్యసనాలకు లోనయిపోయినాడు.

కిరణ్ సరిగాడ్యూటికి వెళ్ళడంలేదు. అతడికి జీవితం చుక్కానిలేని నావగాకనిపిస్తున్నది. ఇంటికి దీపమైన ఇల్లాలు లేని జీవితాన్ని ఎడ్లులేని బండిగా ఊహిస్తున్న కిరణ్ గుండె కన్నీరుగా మారిపోయింది

భూత, భవిష్యత్ కాలాలను తూచి చూస్తున్న కిరణ్ కు భవిష్యత్తు పూర్తి తేలికగా కనిపిస్తున్నది. బార్‌లో కూర్చున్న కిరణ్ ఆలోచించలేక పోతు న్నాడు. ఆలోచనా శక్తి నశించేవరకు పూర్తిగా త్రాగేశాడు.

ఇప్పుడతని మనసు కాస్త తేలికయినట్లని పించింది. బార్‌నుండి తిన్నగా ఇంటిదారి పట్టిన కిరణ్ రోడ్డుమీద నడువలేక పోతున్నాడు.

అతడి కాళ్ళు పటుత్వాన్ని కోల్పోతున్నాయి.

అతడి శరీరం పూర్తిగా వశం తప్పింది.

అలవాటు ప్రకారంగా తిరిగిన దారి కాబట్టి పరిసరాల నిమిత్తం లేకుండా, దారితెన్నూలేకుండా పూర్తిగా వశం తప్పిన శరీరంతో కుడి ఎడమగా నడుస్తున్నాడు.

అకస్మాత్తుగా రోడ్డు మలుపు దగ్గర అతని కళ్ళపై కాంతి పడ్డట్లనిపించింది.

ఆ కారువాడు చేసిన శబ్దం కిరణ్‌కు వినిపిం చడం, కిరణ్ భయంగా తప్పించుకోవడానికి

ప్రయత్నించటం, ఆ కారు కిరణ్‌ను ఢీకొట్టివెళ్ళడం ఇవన్నీ కిరణ్ అసామర్థ్యాన్ని ప్రతిభింబింపజేశాయి

చావు తప్పి కన్ను పోయినట్లు అదృష్టంకొద్దీ కిరణ్‌కు కాలు విరిగి చిన్న గాయాలతో సరిపోయింది.

కిరణ్‌ను హాస్పిటల్ నుండి ఇంటికి తీసుకు వచ్చిన అత్తమామలు అతనిని కనిపెట్టుకుని వున్నారు. మిత్రులు కిరణ్‌ను చూడడానికి వచ్చారు. 'జీవితంలోని ఆటు పోట్లను ఎదుర్కో-లేని నీకే దేవుడు ఎంత కష్టాన్ని కలిగించాడు కిరణ్? ఇక నయినా పిలలను చూసుకుంటూ వారి భవిష్యత్తును గురించి ఆలోచించు' రఘు అన్నాడు.

'లేదు రఘూ! జీవితంపైన ఆశ ఎప్పుడో పోయింది. ఆశలేని జీవితం, లక్ష్యంలేని జీవితం మనిషిని సమాజంలో స్థానాధిరోహణం కంటే స్థానావరోహణం చేయిస్తుంది' అన్నాడు కిరణ్.

'ఆశ లేదని అనుకోకు కిరణ్! నీ జీవితానికి ఆశ ఇప్పుడు నీ పిల్లలే. వారికోసం నీవు నీ పద్ధతులన్నీ మార్చుకోవాలి' అన్నాడు శశి.

'లక్ష్యంలేని జీవితాన్ని ఇక నేను గడపలేను శశీ....అలాగని నా జీవితానికి లక్ష్యమే లేకుండా పోయిందని నేనన లేను.... అయినా ఏమిటో నాకిదంతా అగమ్యగోచరంగా ఉంది' అన్నాడు కిరణ్. తను ఈ విషయంలో ఇంకశ్రద్ధ చూపలేను అన్నట్లుగా.

'జీవితమంటే బొమ్మలాట కాదోయ్ కిరణ్. జీవితం అంటే పుట్టిన దగ్గర్నుండి గిట్టే వరకూ జరిగే ప్రత్యక్ష విషయం.

....ఆ విషయంలో మంచీ-చెడూ, చిన్నా-పెద్దా వంటి కోవకు చెందిన వ్యతిరేక ధోరణికిచెందిన అంశాలు ఎన్నో తారసపతాయి. కానీ, వాటన్నిటి నుండీ మంచి, దన్న అన్న కోవకు చెందిన అంశాలను మాత్రమే వెలికి తీసుకొని తన బ్రతుకును కూడూ, గుడ్డా, నీడకే పరిమితం కాకుండా ఆ కూడూ, గుడ్డా, నీడకు అవసరమయిన ప్రత్యామ్నాయ ఉన్నత వస్తువులతో మేళవించి సుగమమయిన జీవనాన్ని గడపడమే జీవితం.

(ఒకప్పుడు మిత్రులు చెప్పిన మాటలు వినకపోయినా ఇప్పుడు జీవితంలో చాలా దెబ్బ తిన్న వ్యక్తిగా కిరణ్‌కు శశి మాటలలోని అంతర్యం అర్థమవసాగింది.)

...ఇక పోతే జీవితానికి లక్ష్యమంటూ ఏమీ వేరుగా ఉండనవసరంలేదు. మనబోటి మధ్య తరగతి వారికి టాటా, బిర్లా లాంటి గొప్పవారమవాలి అన్న లక్ష్యం జీవిత లక్ష్యంగా మారదు.

జీవితమనేది సముద్రం వంటిదని పెద్దలు ఏనాడో అన్నారు.

ఉదాహరణకు సముద్రాన్ని దాటడానికి చాలా మార్గాలున్నాయి.

ఈదుతూ దాటొచ్చు, చిన్న పడవ ద్వారా దాటొచ్చు, అలాగే పెద్ద పెద్ద నావలూ, స్టీమర్ల ద్వారా దాటవచ్చు. కానీ, ఈ దాటేటప్పుడు సముద్రం లోతునూ, సముద్రంలో మనకు ఎదురయ్యే అవాంతరాలనూ మనము దృష్టిలో ఉంచుకోవాలి.

అలా ఎంత దృష్టిలో ఉంచుకున్నా మనిషి ఈదుతూ సముద్రము దాటడం అసంభవం. అలాగే పడవతో కాటడం దానికన్నా కొంచెం తక్కువ కష్టం. నావ ద్వారా గానీ, స్టీమర్ ద్వారా గానీ దాటడం చాలా తేలిక.

అలాగే మనిషి కూడా జీవితమనే సముద్రంలో హెచ్చు-తగ్గూ తారతమ్యాలు తెలుసుకుంటూ కష్టాలకు ధైర్యంగా ఎదురీది నిండు నూరేళ్ళ జీవితాన్ని అనుభవించిన నాడు ఆ మనిషికి అన్ని వ్యూహా- కంటే గొప్ప వ్యూహమయిన జీవన వ్యూహం జయించిన ఘనత అతని జీవిత లక్ష్యంగా ఉండిపోతుంది' అన్నాడు శశి ఆవేశంగా.

శశి మాటలు కిరణ్ మనసును స్పందింప చేసినాయి.

కిరణ్ జీవితానికిదో కొత్త ఊపు వచ్చినట్లయింది. అసలు నిజంగా ఆనాడు ఈ మిత్రులు చెప్పిన మాటలు నే నెందుకు వినలేదా అనిపించింది కిరణ్ కి.

నిండు నూరేళ్ళ జీవితాన్న సాఫీగా గడిచేటట్లు మలచుకుని బాధల్నీ, అనందాన్నీ దిగమింగుకునేలా మారిన మనిషికి అంతకన్నా జీవితలక్ష్యం ఏమీ ఉండదని గ్రహించిన కిరణ్ కళ్ళల్లో చిరు కాంతులు వెలిగాయి.

అతడి జీవితంలో ఒక పగలు గడిచాక....ఒక పీడకల వచ్చాక....ఉదయించిన రెండవ రోజు కొత్తదనాన్ని చూసి రఘు, శశి సంతోషపడ్డారు.

# సామాజికాంశాల నాడిని పట్టిన 'జాడి' కథలు

ఎర్రోజు వెంకటేశ్వర్లు

తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో ఇప్పటికీ ఆదరణ పొందుతున్నది కథా ప్రక్రియే. 'గాలివాన', 'స్వర్ణకమలాలు' అంతర్జాతీయ స్థాయికి తెలుగు కథను తీసుకు వెళ్ళగలిగాయి.

ఈనాటికీ ప్రక్రియ పరంగా కాలుష్యం పొందని కథ తనకుతానే తన అస్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ వస్తున్నది. ఇటీవలి కాలంలో తెలుగు కథ నూతన రచయితల చేతుల్లోకి చేరి సుసంపన్నమైంది. ఈ తరంలో 200లకుపైగా కథలు- నాలుగు నవలలు రచించి అవిశ్రాంతంగా రచనలు చేస్తున్న రచయిత సదానంద్ శారద. ఆయన వెలువరించిన మొదటి కథా సంపుటి "జాడీకథలు' పాఠకులను విశేషంగా ఆకర్షించింది. ఈ కథల సంపుటిని విశ్లేషించేందుకు ఉద్దేశించిన వ్యాసం ఇది.

దైనందన జీవితంలో పొందుతున్న కష్టనష్టాలనుంచి కొంతవరకైనా ఊరట (Releaf) కలిగించడానికీ, ఎదురయ్యే సమస్యలను సమగ్రంగా అవగాహన చేసుకొనడానికి కథకందే మించిన సాధనం లేదు. నేటి కథలు చాలవరకు నవలల్లాగా వ్యాపారదృష్టికి లోనుగాక, తెలుగుదనం. వాస్తవికతను ప్రతిబింబిస్తున్నాయి. ఆ కోవకు చెందినవే ఈ జాడీ కథలు. తెలంగాణ జీవితాన్ని ప్రతిబింబించే కథలే గాక భాషను కూడా జీవింపజేసే శక్తి సామర్థ్యాలు జాడీ కథలకున్నాయి. సమాజంలోని అసమానతలను నిర్మూలించే ధ్యేయంతో సాగింది రచన. బానిసతనాన్ని భిక్షాటనను, కులద్వేషాన్ని తొలగించాలనే తపనతో పాటు పెత్తందార్ల దురాగతాలను ఎదిరించాలనే ప్రబోధనలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఈ కథలన్నీ తెలంగాణ మాండలికంలో సాగడమేగాక పాత్రల యాసతో జీవంపోసుకున్నాయి. ముఖ్యంగా తెలంగాణాలోని దొరలు, జీతగాళ్ళను ఎన్నివిధాల చిత్రహింసలు పెడ్తారో వాస్తవికంగా, హృద్యంగా వర్ణింపబడింది.

'జాడీకథ'లో గవురయ్య ఓ దొరకు జీతగాడు. పట్నంలో ఉన్న దొరకొడుక్కు తొక్కు జాడీ తీసుకపొమ్మని దొర ఆజ్ఞాపించాడు, పాలేరు ఎంతో సంతోషంతో జాడీని నెత్తినపెట్టుకొని నడచుకుంటూ ఎన్నోకష్టాలు పడుడూ పట్నం తీసుకెళ్తాడు. దొరకొడుకు చంద్రశేఖర్ కీ పాలేరు భిక్షగాని కనిపించాడేమో వాళ్ళ స్నేహితులకు బెగ్గర్‌లా అని చెప్పాడు. అతని ఇల్లాలు పాలేరుతో

జాడీని లోపలికి తీసుకెళ్ళమంటుంది. ఆ దొరసాని దృష్టంతా జాడీమీదే తప్ప మోసుకొచ్చిన పాలేరు మీద లేదు. ఆకలౌతుందన్నా అన్నంలేదని తలుపు మూసేస్తుంది. బజారులోకి తోసివేసే సంస్కృతి దొరతనంలో తొణికిస లాడింది. ఇందులో ఇతి వృత్తం కంటే వర్ణనకే అధిక ప్రాధాన్యత నిచ్చి నట్లుగా కనిపిస్తుంది.

'ఉన్నదంతా పదిమందికి దానం చేసిన వ్యక్తిలా ఉన్నాడు.' గవురయ్యను చిత్రిస్తూ రచయిత చెప్పిన వాక్యమిది. అతను వేసుకున్న చినిగిన గుడ్డలే నిదర్శనంగా చిత్రించాడు. గవురయ్య లాంటి దానకర్ణులు పల్లెల్లో మనకు పదే పదే కనిపించడం కూడా పరిపాటే.

'తమ ఊరికి రోడ్డు ఎందుకు రాలేదు? అని ప్రశ్న ఉదయించాలంటే అతడు మరికొన్ని జన్మ లెత్తాలి' అంటాడు రచయిత. అవిద్యావంతులైన వేల కొలది గవురయ్యలను చూసినప్పుడు మనకు కలిగే సందేహాలిట్లే ఉంటాయి. అమాయకత్వానికి అజ్ఞానానికి ప్రాతినిధ్యం వహించే పాత్రల్లోని ఆవతలి కోణం స్పృశించడం వల్లే ఇట్లా చిత్రీకరించ గలిగాడు రచయిత.

పట్నంవచ్చి అడ్రస్ కోసం దేవులాడే గవురయ్యను, పల్లెవాడని ఎగతాళి చేసి ఏడిపించే యువకుల్ని చిత్రించి నేటి వ్యవస్థ రూపాన్ని కళ్ళకు కట్టించాడు. పల్లె నుండి పట్నం మొదట వచ్చిన వాళ్ళకు కొద్దో, గొప్పో ఈ తిప్పలు తప్పవు. పాఠకులను నిలబెట్టి ఆలోచింపజేసే కాల్పనికతకు ఉదాహరణంగా దీనిని చెప్పుకోవాలి. వానలో తడుస్తూ, నడుస్తూ ఎన్నో అవమానాలు పొంది కష్టపడి పచ్చడిజాడి తెస్తే దొరతనం బెగ్గరంటూ ముద్ర వేసింది. ఆ బెగ్గరే బస్తాలకొద్దీ ధాన్యం పండించి వాళ్ళకు ఇస్తున్నాడనే స్పృహ వాళ్ళకు లేదనేది స్పష్టం. దొరలకు సుఖాలను ఇస్తున్నది పట్నాలకు తిండి పెడుతున్నది వాడి కష్టమే. ఫ్యాక్టరీలను నడుపుతున్నది వాడి కష్టమే. అభ్యుదయానికి పునాదులు గవురయ్య లాంటి వాళ్ల అనే సత్యాన్ని రచయిత నొక్కి చెప్పుతాడు.

'ఆ తలుపుల వెనకనున్న వర్గాన్ని చూస్తూ ఆకాశం గట్టిగా ఉరిమింది' అని వ్యంగ్యంగా ముగించాడు. ఇందులో ఇతివృత్తం చిన్నదే అయినా వర్ణనానైపుణ్యం, కథాకథనం పాఠక హృదయాలకు హత్తుకుంటుంది.

'తొక్కుడుబండ' కథలో తొక్కుడుబండే గంగడు. ఈ కథలో దొర దురాగతాలు, జీత గాళ్ళ పాట్లు చిత్రితమైనాయి.

పీడిత వర్గానికి గంగడు పాపారావు భూస్వామ్య పెత్తందారి వర్గానికి ప్రతీకలు. పెత్తందారి వ్యవస్థ ఇంకా ఎంతో కాలం సాగదనీ పీడితప్రజలే చైతన్యవంతులై ఆ వ్యవస్థను పాతాళంలోకి తోస్తారనీ కథలోని పాత్రలద్వారా నిరూపించాడు. గంగడు పాపారావుని చంపక స్వేచ్ఛగా బ్రతికేందుకు బంధాలు త్రెంచుకొని స్తాడు. హింస ప్రధాన సమస్యకు పరిష్కారం కాదనే హితాన్ని బోధిస్తాడు ముగింపులో.

'వలపు' కథలో అయిలయ్య పంచాయతీ ప్యూన్, కృష్ణమూర్తి ఆఫీసర్. అతని నవ్వుని చూసే మంచోడు అని నిర్ణయించుకున్న అమాయకుడు అయిలయ్య. ఆఫీసర్ భార్య కుమారి పిల్లవానికి పాలిస్తే ఆ అందాలు తగ్గుతాయంటే అయిలయ్య భార్య దుర్గమ్మను రప్పించి పాలిప్పి

స్తుంటాడు. అమెను ఇంటికూ్కడ పోనీయకుండా చేయడంవల్ల ఇ౯్టలోఉన్న పసిబిడ్డ మీదే జెంగ పడ్తుంది. 'అంబా' అని అరిచే శక్తిలేని దూడను చూసి గుర్తొచ్చింది. జీతగాడు ప్రయత్నాలెన్ని చేసినా పాలివ్వక కుమ్మబోతుంది ఆవు. చివరికి పలుపును త్రెంచుకొని దూడను చేరి పాలిస్తూ తృప్తి నొందిందది. మూగజీవి అయినాఅది మౌనపోరాటాన్ని నేర్పింది.భర్త ఉద్యోగం పోతే పోయిందనే మొండి ధైర్యంతో తలుపులు తోసుకొని బయటికి వస్తుంది. స్వేచ్ఛలేని బానిస కొలువు వ్యర్థమని చెప్పే ధోరణి దుర్గమ్మది. 'నామాలు పెట్టుకున్న వాళ్ళంతా భక్తులు కారు. కన్నవాళ్ళంతా తల్లులు కారు' అంటూ కుమారి లాంటి మాతృవేదన లేనివాళ్ళను నిరసించాడు రచయిత.

'ఫోటో' కథ చిత్రణ కొత్తఊపు నిస్తుంది. అఖిల భారత స్థాయిలో బహుమతి పొందిన కిరణం ఫోటోను ప్రశంసిస్తూ, డిన్నర్ జరుగుతున్న హోటల్ ముందు అడుక్కుంటున్నాడు లచ్చుమయ్య. అతని ఆకలి డొక్కలను చూసి ఏడుస్తుంది తల్లి. తిండి దొరకలేదు. తర్వాత ఓ యజమాని ఇంట్లో విందుండే భవనం వెనక నిల్చున్నారు. పనిమనిషి కూడా తిట్టి తలుపుమూసింది. మళ్ళీ ఎంగిలి భోజన పదార్థాలు చెత్త కుండిలో పడేసి తలుపులు దభాల్న వేసింది. వాళ్ళకు మాత్రం నిరాశే మిగిలింది. ఇక ఆగలేక లచ్చుమయ్య చెత్తకుండిలో చేతికందినవి తింటుండగా ఫోటోగ్రాఫర్ ఫోటో తీసుకుంటాడు. దానికి పారితోషికంగా పావలా విదిలించిపోతాడు ఫోటోగ్రాఫర్.

కళాకారులకు, ధనవంతులకు గొప్పగొప్ప అవార్డులకు కారణమౌతున్న లచ్చమయ్యలాంటి వాళ్ళెందరో ఉన్నారు. బహుమతులు తెచ్చుకున్న వాళ్ళయినా వాళ్ళ ఆకలి తీర్చడం లేదు. ఫోటో ప్రదర్శనకు ఈ బహుమతులు ఆవశ్యక మౌతు న్నాయే అని పాఠకుల మనస్సులను హత్తుకునేట్లుగా కథ నడిపాడు.

'కొడుకు చూపించిన పావలా నాణాన్ని చూచి ఏడుస్తుంది తల్లి. 'ఆమె పిచ్చిది, ఏడ్చింది; బహుమానం తేగల ఫోటోను కన్నందుకు గర్వ పడాలి అంటూ వ్యంగ్యంగా కథ ముగించడం రచయిత నైపుణ్యాన్ని తెలియజేస్తుంది.

'తులసీ మొక్క' కథలో నిజాయితీ గల ఉద్యోగులు ఏదో ప్రలోభాలకు లోనై లంచాల వైపుకు మొగ్గినా తీసుకోలేని తీసుకున్నా వాళ్ళ అంతర్మథనం ఎలా పొందుతారో గుర్నాథం పాత్రే చెప్తుంది.

గుర్నాథం లంచం తీసుకోలేదు, కాని తీసు కున్నట్లు ఫీలవుతూ, ఆ అనుభవం ఎట్లా ఉంటుందో లీలగా ఊహిస్తాడు, సాటివాళ్ళ ఏవగింపు లకు హతాశుడవుతాడు. ఎవరు ఏమను కుంటున్నా తన గూర్చే అనుకుంటున్నారను కుంటాడు. చివరికి భార్య మౌనం....ముభావం... నిర్లిప్తత" చూసి లంచం తీసుకున్నానని తెలి సిందేమో అని బాధపడ్డాడు. సాంఘిక దురాచారా లకు బానిసయినవాని బతుకు ఎంత హీనంగా సాగుతుందో ఊహించుకొని మథనపడ్డాడు.

ఎన్ని కష్టాలైనా రానీ మీరు నిజాయితీ గల ప్రభుత్వ ఉద్యోగిగా ఉండడమే నాకు కావలసింది. అని భార్య అన్నప్పుడు గర్వపడిపోతాడు.

గుర్నాథం స్పష్టంగా మధ్యతరగతి కుటుం బానికి, చెందినవాడు. అతని నిజాయితీ వల్ల డబ్బు పెరగక పోగా, కనీస అవసరాల కోసమే అప్పులు చేస్తాడు. వీటన్నింటిని సమర్థిస్తూనే భార్యసీత సహ

కారం అందిస్తూ వస్తుంది. ఆర్థిక దుస్థితిలో కూరుకుపోయిన మధ్యతరగతికి చెందిన భార్య భర్తలు ఇద్దరూ ఉద్యోగస్థులైతే తప్ప కుటుంబం గడవడం కష్టంగానే ఉంటుందని ఈ సంఘటన తెలుపుతుంది.

'హద్దురాయి' కథలో భూస్వామి భూమి పక్కన, పేదవాని పొలం ఉంటే ఎన్ని సాకులతో హద్దురాయి జరిపేస్తారో రచయిత చిత్రించాడు. ఈ తతంగమంతా తరతరాలుగా నిర్విఘ్నంగా సాగింది. కానీ నేటి తరం అడ్డుకోక మానదు. అనే దానికి నిదర్శనంగా ఈ కథలోని సోములును చూపించాడు రచయిత.

'బలం' కథలో సామాజిక అసమానతలను సంకుచితత్వాన్ని అనవసరంగా పిల్లలకు నేర్పవద్దని నీలవేణి పాత్ర ద్వారా సూచిస్తాడు. రామిరెడ్డి, నరసింహారెడ్డిల కులాల్లో తేడా లేకున్నా, ఆస్తి, అంతస్థులలో తేడా కనిపిస్తుంది. రామిరెడ్డి కున్నది నాలుదెకరాలయితే, నరసింహారెడ్డి కున్నది వంద ఎకరాలు, పశు సంపద కూడా ఎక్కువే. నీటి పారకం గూర్చి జీతగాళ్ళు హేళన చేస్తే వాళ్ళ చెంప వాయించాడు రామిరెడ్డి. ఈ విషయం నర్సింహారెడ్డికి చెప్పగా, రామిరెడ్డి భార్యను అతని ముందే బజారుకు లాక్కొచ్చి రాక్షసంగా చీరలాగేస్తాడు. ఈ సంఘటనను చూసి అందరూపారిపోతే చాకలి వెంకన్న మాత్రం కొడవలి అందుకొని అడ్డుకోబోతాడు. ఆవాడ వాళ్ళంతా అతనికి తోడువస్తారు. అంతే కాలికి బుద్ధిచెప్తాడు నర్సింహారెడ్డి. మానప్రాణాలను రక్షించిన చాకలి వెంకన్న కాళ్ళమీద పడపోయింది నీలవేణి. 'నువ్వు మా తోబుట్టులాంటి దానివమ్మా. ఈ కులాలు....మతాలు మనం పెట్టుకున్నయి.... మనం ఒక్క తల్లి పిల్లలం తల్లీ" అంటూ వారిస్తాడు. ఆమెను ఈ లోకంలో ఉన్నాయి రెండే తెగలు.... ఉన్నోళ్ళు లేనోళ్ళు ఉన్నోళ్ళ ఆగడాలు సిదక తొక్కాలంటే మనం కలిసుండాలే.... అంటూ సమైక్యతను బోధిస్తాడు అసమానతల అంధకారంలో మగ్గిపోతున్న అజ్ఞానులకు కనువిప్పు కలిగింది.

'మంత్రి కొడుకు' కథలో అధికార పీఠం మీదున్న తండ్రి బలం చూసుకొని కొడుకులు చేసే దురాగతాలు కళ్ళకు కట్టించాడు రచయిత. పరీక్ష హాల్లో రాసేది వదిలేసి ముందు సీట్లో కూర్చున్న విద్యార్థినిని సిగరెట్‌తో కాల్చి పైశాచికానందాన్ని పొందుతాడు మంత్రి కొడుకు. అట్టి వాళ్ళకు సరియైన గుణపాఠం అబలలే చెప్తారనే సత్యాన్ని ఇందులో చూపాడు. అల్లరి పాలయిన అమ్మాయి సిసింద్రిలా లేచి కరాటే ఫైట్‌తో మంత్రికొడుకు పళ్ళు రాలగొడుతుంది. స్త్రీలు అబలలు కాదు సబలలని నిరూపించే సన్నివేశాన్ని చిత్రించి ఆత్మరక్షణార్థం స్త్రీలు కరాటే లాంటివి నేర్చుకోవడం తప్పేం కాదని ధ్వనింప జేశాడు రచయిత

అధికార గర్వంతో కళ్ళు మూసుకుపోయి ప్రజల్ని పీడించే భ్రష్టులకు ఏదో ఒకరోజు శిక్ష పడక తప్పదని నొక్కి వక్కాణించాడు అబలల పట్ల రోజురోజుకు పెరిగిపోతున్న అత్యాచారాలను నిర్మూలించే ధ్యేయం రచయితలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

'ఉప్పునీళ్ళు' కథలో నిమ్న జాతులను నీచంగా చూసే వర్గాలను చిత్రించాడు. హరిజన (విద్యార్థుల)నుగురించి కాలేజిల్లోనూ, సమాజం లోనూ ఎంత చులకన చేస్తున్నారో కమలపాత్ర చెప్తుంది.

కమల బస్‌స్టాప్‌కు వెళ్తున్నప్పుడు విద్యార్థులు అనుకుంటున్న మాటలు ఆమెను శూలాలై గుచ్చుకొన్నాయి. 'ఎంత ట్రైచేసినా మాసిస్టర్‌కు ఎం.బి.బి.యస్.లో సీటు రాలేదు.దాస్.ఏ ఎస్సీనో ఎస్టీనో అయితే బాగుండేది. ఎస్సీ అంటే....సుప్రీం కాస్ట్ ప్రత్యేక సదుపాయాలను పొంది మనల్ని వెనక వేస్తున్నారు అంటూ హేళనచేస్తుంటారు. రాజ్యాంగం

కల్పించిన రిజర్వేషన్లు గురించి స్వార్థ చింతనతో విమర్శించడం మంచిది కాదని రచయిత భావించి ఈ కథలో చిత్రించాడు.

ఈ సంపుటిలో చివరి కథ 'ఆయా', కాలేజీలో శాంతమ్మ ఆయాగా పనిచేస్తుంటుంది. మూడంతస్థుల మెట్లు ఎక్కుతూ, దిగుతూ బోలెడంత చాకిరీ చేస్తుంది. పని ఒత్తిడి తగ్గించడానికి మరో ఆయాను పెట్టించడానికి యాజమాన్యం చర్య తీసుకోదు. ఆయా పనులు కళాశాలలకే పరిమితమయితే బాగుండేది. శూర్పణఖ రావుకు, కుక్కకు కూడా సేవ చేయాల్సివచ్చేది. తిండి తిప్పలు లేకుండ జనమంతా పనిచేస్తూ ఉండేది. ఒకనాడు తిండి తినకుండానే కుక్కను దవాఖానలోచూపించి వచ్చి ఇంటికి తిరిగి వెళ్తూ మెట్ల మీద కూలబడి చనిపోతుంది.

ఆ కథ జాలి కథ. ప్రభుత్వ ప్రయివేట్ కార్యాలయాల్లో ఇలాంటివి జరుగుతూనే ఉంటాయి. అధికార్ల డామినేషన్‌కు బలయి పోయే పాత్రలకు ప్రతీకగా శాంతమ్మను చిత్రించాడు రచయిత.

'తలుపు చప్పుడు' కథలో పట్టణాల్లో కట్టడాల కోసం మున్సిపాలిటీ వాళ్ళు చీటికి మాటికి ఎలా లంచాలు గుంజుతారో చక్కగా వివరించారు.

'ప్రయాణం కథలో ప్రయాణీకుల భిన్న మనస్తత్వాలను, మాట చాతుర్యాన్ని చక్కగా వర్ణించారు.

'పనసపండు' కథలో తీరని కనీస కోరికలను గురించి చిత్రించాడు. పేద తండ్రి తన కొడుక్కు కనీసం ఒక పనసపండైనా కొనలేకపోయి ప్లాస్టిక్ పండును తెచ్చిమురిపిస్తాడు. రూపగుణమేగాని రుచి గుణం దాని కెక్కడిదని మధ్యతరగతి మందహాసాన్ని చిత్రించాడు.

'పండుగనవ్వు' కథలో పండుగ (**Enjoy**) గా చేసుకోలేని ఉద్యోగి కృత్రిమ నవ్వును చక్కగా వర్ణించారు.

'ఇంటి వెలుగు' ఇంటిలోని అంతరార్థాన్ని విప్పి చెప్పిన కథ. భార్యమీద భర్తకు, భర్త మీద భార్యకు అంతులేని ప్రేమ ఉంటేనే ఇంటి వెలుగని నిర్వచిస్తాడు రచయిత. అది లేక పోతే ఇల్లంతా చీకటే అవుతుందంటాడు.

జాడీ కథల సంపుటిలోని కథారచన ప్రణాళికా బద్ధంగా ఉన్నట్లు కనిపించదు. వస్తువులోను వర్ణనలలోను కథల్లో సామ్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. జాడీ, తొక్కుడుబండ: మొ॥ కథల్లో వస్తువు ఒకటే అయినా విభిన్నత కనిపిస్తుంది. హద్దురాయి. బలం కథల్లో భూస్వామ్య వ్యవస్థలో, దురాగతాలు కనిపిస్తాయి. పాత్ర చిత్రణలో రచయిత చూపిన నేర్పు ప్రసిద్ధ కథకులను తలపింప జేసేదిగా ఉంది.

శారద కథలన్నీ సామాజిక స్పృహ కలిగినవే. ముఖ్యంగా బడుగు వర్గాల ప్రజల్లో జాగృతిని కలిగించడం ఒక్కటే గాదు భూస్వాముల దోపిడికి అడ్డుకట్టలు వేయడం కూడా పేర్కొనదగింది. సమస్యలను స్పృశించడం మాత్రమే చేయక వాటి మూలాల్లోకి ప్రవేశించి పరిష్కారాలు కనుక్కోవడం బాగా కనిపిస్తుంది. కొన్ని కథల్లో ముగింపులు పాఠకులకు ఆలోచనల్ని కలుగజేస్తాయి. సాంప్రదాయిక పద్ధతుల్ని అధిగమించకుండా సామాజిక విప్లవాన్ని కలిగించే వెఖరి రచయితది.

సదానంద్ శారద ఇప్పటికి 'జాడీ' 'గొలుసు' కథల సంపుటాలను వెలువరించాడు. అముద్రితంగా నాలుగు నవలలు కొన్ని వందల కథలు ఉన్నాయి. ఇటీవల ఆయన రచించిన 'మంచినీళ్లబావి' నవలకు 'ఆంధ్రప్రభ'. పత్రిక ప్రథమ బహుమతిని ప్రకటించింది.

సీతాఫల్ మండీ
సికింద్రాబాదు

× + ×

# బహుముఖ ప్రతిభాశాలి

## పుట్టపర్తి నాగపద్మిని

సమున్నత హిమవన్నగాల సౌందర్యం అక్షరాల కతీతమైనది. పలుమార్గాల నుండి కైలాసనగర దర్శనానికై వచ్చేయాత్రికులకు యే దిక్కు నుంచి చూచినా ఆ యా విశేషాలతో కనిపిస్తుంది పవిత్రమైన భారతీయ సంస్కృతీ ప్రాశవానికి ఆధ్యాత్మికక్షేదిగ్దర్శనానికి ప్రతీకగా నిలిచిన ఆ హిమవన్నగం. అలాగే కవి మహాకవి జాతీయకవి వంటి యెల్లలను అతిసునాయాసంగా దాటి 'విశ్వకవి'గా అనంత విశ్వాన్ని ఆక్రమించిన రవీంద్ర కవీంద్రుల 'విశ్వదర్శనం' ఒక్కొక్కరికి ఒక్కో విధమైన అనుభూతిని కలిగిస్తుంది. కవి పుంగవునిగా కళారాధకునిగా సౌందర్యపిపాసిగా దేశ భక్తునిగా విద్యావేత్తగా విశ్వజనీతను సుదృఢపరచటానికి ప్రయత్నించిన దీక్షా దక్షునిగా యిలా అనేకానేక రూపాలలో ఆయన దర్శనమిస్తారు.

'రవీంద్రనాథ ఠాగూర్' అన్న పేరు వినగానే మునుముందుగా స్ఫురించే గ్రంథం 'గీతాంజలి'— వెనువెంటనే 'నీలి నీలి కాంతులను విరజిమ్ముతూ. అల్లనల్లన కదిలిపోయే నక్షత్రకాంతల నడకలూ, ఆ కన్నియలను కనిపించీ కనిపించక వుడికిస్తూ ఆనందించే నెలరాజు దాగుడు మూతలు, యీ యిరువురి ఆటలనూ విస్ఫారిత నేత్రాలతో తిలకించే పూబాలల అమాయిక ముఖారవిందాలూ, చిరు వెలుగులను వెదజల్లుతూ ఆ వెలుగులకే జీవితాలను అర్పించే దివ్వెల స్వార్థ రహిత త్యాగాలూ, హృదయాంతర సీమలను దాటి ఆకసపు అంచులదాకా పయనించే ఒక నిరంతర యాత్రారతుడైన విశ్వమానవుని గాన మాధుర్యం....యిలా యెన్నో యెన్నెన్నో గుర్తుకు వస్తాయి. రవీంద్రుని భావ చిత్రాలు అంతటి తాదాత్మ్యస్థితిని పాఠకులకు పంచి పెట్టటమే కాదు. ఆ అలౌకికమైన అమూల్యానుభూతుల మాధుర్యంలో ఓలలాడించి, రవీంద్ర 'కవీంద్రుడంటే యింతటివాడు సుమా! అని తెలియజెప్పతాయి.'

నా కవిత తన సర్వాలంకారాలనూ పరిత్యజించింది ప్రభూ! వేష భూషల పట్ల ఆమెకిప్పుడు కించిత్తు గర్వమూలేదు మన యిరువుర పరిపూర్ణమైన కలయికకి యీ అలంకారాలు అడ్డువస్తాయి కదామరి! నీ తీయని గుసగుసలకి వాటి సవ్వడి అంతరాయం కలిగించదూ!

ఈ సకల ప్రపంచ వేడుకలలో పాల్గోనమని నాకు ఆహ్వానం వచ్చింది. నా జన్మధన్యమైంది!

ఈ వేడుకలలో నా వాద్యకళను శక్తిమేరకు ప్రదర్శించాను.

ఇప్పుడిక లోనికి వచ్చి, నీ ముఖారవిందాన్ని దర్శించుకుని, నా మౌన ప్రార్థనని విన్నవించుకునేందుకు ఆనతి ఇవ్వవా ప్రభూ!'

'నీవు నాతో మాటలాడకుండే నీమౌనంతోటే నా మనస్సుని నింపుకుంటానులే, విస్ఫారిత నక్షత్ర నేత్రాలతో కొద్దిగా తలవంచి తదుపరి ఆజ్ఞకై వేచి వుండే రాత్రిలా, నేనూ నిరీక్షిస్తాను ప్రియతమా!'

రంగు రంగుల రెక్కలతో నిగనిగలాడే సీతాకోక చిలుకకి పువ్వుపువ్వులతో గుసగుసలాడేందుకు బోలెడంత తీరిక కానీ చుక్కచుక్క తేనెను సేకరించే మధుపానికి ఒక్కో పూవుతో నిలిచి మాట్లాడేందుకు తీరికేదీ?

బాట కిరువైపులా నిలిచి స్నిగ్ధ వదనాలతో పలుకరించే పూబాలల అందాలను ప్రశంసిస్తూ ముందుకు నడు. వాటితో పరాచికాలాడుతూ నిలబడిపోకేం!

నిజమేగా మరి! అత్యంత అపురూపమైన మానవ జీవన పరమార్థాన్ని అవగతం చేసుకోక, కేవలం జీవితమంటే ఆనందంగా కాలాన్ని గడపటమే! నన్న భావనగలవారికి అంతా తీరికే. నిరంతర సత్యాన్వేషణా పరునికి కనీసం ఊపిరిపీల్చుకోవటానికైనా సమయం దొరకదుమరి! రవీంద్రుని మాటల్లోని అంతరార్థంయిదే!

నిజానికి ప్రతి మానవుడూ పుట్టుకతో పరిశుద్ధుడే. కానీ తరువాత స్వార్థం, సంకుచిత ధోరణులతో భౌతిక విషయాసక్తితో కలుషితుడవుతాడు. సృష్టిలోని యితర జీవజాలం కంటే మానవుడు పూర్తిగా భిన్నుడు. అతనిలోని యీ ప్రత్యేకతను వెలికి తీయటానికి చాలా పద్ధతున్నాయి. కానీ యీ విషయంలో భారతీయులు అవలంబించిన పద్ధతి వైవిధ్యంతో కూడినది. మానవుడంటే మూడువంతులు దివ్వెడు ఒకవంతు మాత్రమే విశ్వగతుడని ప్రాచీన ఆర్యోక్తి. ఈ సత్యాన్ని గుర్తించిన వారే పరమేషిని తెలుసుకొనగలరని వారి విశ్వాసం ఒక్క మానవుడే కాదు. 'విశ్వమంతా' దేవశక్తితో నిండివుంది. అట్టిశక్తిని గుర్తించిన తరువాత 'అహంబ్రహ్మాస్మి' అన్న వేదవాక్కు వెలువడింది. అపౌరుషేయాలైన వైదిక వాఙ్మయం లోని యీ ప్రబోధసారమే భారతీయ వాఙ్మయంలోనూ ప్రతిబించింది. అందుకే తనలోని భగవతత్త్వాన్ని ప్రకృతిలోని భగవతత్త్వాన్ని సమానంగా గుర్తించి, ప్రకృతిని హృదయ పూర్వకంగా ప్రేమించటమే విశ్వప్రేమ. ఈ విశ్వప్రేమ సాధనతోనే రవీంద్రుడు 'విశ్వకవి'. కాగలిగాడు. తన యీవిశ్వజనీనతావాదాన్ని సర్వజనామోదం చేయాలన్న ఆలోచనతోనే ప్రాక్పశ్చిమ ప్రపంచమంతా పర్యటించిన రవీంద్రులు మానవులలోని సంకుచిత దృష్టి స్వార్థపూరిత మనస్తత్వం గమనించి నిరాశా నిస్పృహలకు లోనయ్యారు. దేశాలనీ-మతాలనీ గూళ్ళు కట్టుకుని కూపస్థ మండూకాలుగా వుండటం ఆయనకి నచ్చలేదు. ఈ మానవులంతా ఒక చోట చేరి స్వచ్ఛందంగా పరస్పర సంస్కృతీ విజ్ఞాన వినిమయం చేసుకోవాలనీ-తద్వారా అభివృద్ధి చెందాలనీ ఆశించారాయన. ఫలితం-'విశ్వభారతి' ఆవిర్భావం.

మానవ జీవితం యొక్క మహిమను గుర్తించి పరిపూర్ణ జీవితాన్ని అనుభవించారు రవీంద్రులు.

ఆటు తరువాత కవిగా విశ్వకవిగా గురుదేవులుగా విశ్వమానవుల దివ్య నీరాజనాలందుకున్న రవీంద్రుల ఆధ్యాత్మికసాధన గీతాంజలి వంటి గ్రంథాల సాధన ద్వారా అవగతమౌతుంది.

ఉపనిషత్తుల ద్వారా వారు గ్రహించిన విషయాలను యీ విధంగా తెలియజేశారు- ''ఉపనిషత్తులలోని శ్లోకాలు వాటి సందేశాలూ నన్ను చాలా ప్రభావితంచేశాయి. ఇంకా బుద్ధుని ప్రవచనాలూ ఆత్మానుభవ సంభరిత విషయాలూ నన్ను పూర్తిగా సమ్మోహితుణ్ణి చేశాయి. వాటినే నా అనుష్ఠానంలోనూ ప్రతిబింబింపజేసుకున్నాను, నా ప్రవచనాలలోనూ వాటినే ప్రచారం చేస్తుంటాను. పునర్జన్మ పట్ల వారికున్న నమ్మకం గీతాంజలి సాధనల లో ప్రస్ఫుటంగా తెలుస్తుంది. మరో నూత్న జీవితానికి మృత్యువు 'సంకేతం' అని అయన అంటారు. ''నన్ను అనంతుణ్ణి చేశావు. అది నీకొక లీల. యెప్పుడో ఒకప్పుడు పగిలిపోయి. ముక్కలయ్యే ఒక పాత్రలోని జీవనధారని మాటిమాటికి ఖాళీచేసి మరల మరల నూతన జీవనామృతంతో నింపటం నీ ఆట. యుగ యుగాలు గడిచాయి. అయినా నీ యీ క్రీడకి అంతులేదు మరి: అంటారాయన

కవికీ ఒక మతం వుందని రవీంద్రుని భావన. కాని ఆ మతంలో కవి యొక్క నవనవోన్మేషమైన ప్రతిభ ఒక నిరంతర స్రోతస్విని. విశ్వాన్ని తనతో సమన్వయ పరచుకుంటూ తనలో ఒక కల్పనా జగత్తును సృష్టించుకుంటాడతను.

'సాధన' అనే గ్రంథంలో ఆత్మానుభవాన్ని ప్రేమ పారవశ్యంలో అచంచల కార్యదీక్షలో సౌందర్య రసాస్వాదనలో అఖండ బ్రహ్మతత్వంలో సాధించగలమని నిరూపించారాయన. అనేకత్వాన్ని ఏకత్వంగా మలచుకోవట సాధనల పరాకాష్ఠ.

ఈ విషయాన్ని వివరించేటప్పుడు రవీంద్రుడు ఒక తత్త్వవేత్తగా దర్శనమిస్తాడు.

తత్త్వవేత్తగానే కాక, చక్కటి కవిగా దర్శనమిస్తారాయన. స్ట్రేబర్డ్స్ అనే లఘు వచన కవితా సంపుటిలో అతి చిన్న వాక్యాలలో కొండంత భావాన్ని పొదిగే వారి కవితా చాతుర్యానికి తలవంచని వారుండరేమో ఉదాహరణకు యీ పంక్తుల్ని గమనించండి.

'భూదేవి కన్నీళ్ళే, పువ్వులనే ఆమె చిరునవ్వులకు దోహదమిస్తాయి.'

'సామ్రాజ్యాలంటే భగవంతునికి విసుగు. చిన్ని పువ్వులంటే ప్రాణం మరి!'

కంటికి కనురెప్పల్లాగే, కృషికి విశ్రాంతి.'

'తాను సృష్టించిన సుప్రభాతాలే ఓ వింత అనుభూతి భగవంతునికి'.

'నిరంతర సృష్టి కార్యంలోనే తనని తాను గుర్తిస్తాడు భగవంతుడు.'

కథకుని రూపంలో గూడా రవీంద్రులు తమ ప్రత్యేకతని నిలుపుకున్నారు. ఆయన రచనలలో మసిలే వ్యక్తులు కేవల వ్యక్తులు కారు, ఒక వూహకు. ఒక భావనకు ప్రతీకలు. వారు మాట్లాడేవి మాటలు కావు. సంభాషణా రూపంలో వున్న కవిత్వం మమతలతో మత్సరాలతో, ఈసులతో, ద్వేషాలతో స్వార్థంతో, త్యాగంతో రకరకాల రాగద్వేషాలతో సంకీర్ణమై వున్న మానవ మనస్తత్వాలను మథించి మానవ స్వభావంలోని హాలాహలాన్ని అమృతాన్నీ కూడా మనముందుంచారు రవీంద్రులు.

సాంప్రదాయకమైన వ్యవస్థలపట్ల ఆయనకు గల విముఖతని వ్యంగ్య ధోరణిలో సున్నిత

హాస ధోరణిలో వారి రచనలలో వ్యక్తమవుతుంది. సమన్ జోడ్ బాబులు. గిరిమ, పోస్ట్‌మాస్టర్, కాబూలీ వాలా వంటి ఎన్నో కథలు రవీంద్రుని కథా కథన కౌశలానికి అద్దం పట్టాయి. ఆయన తన కథలలో చిత్రించిన వ్యక్తులలో మనస్తత్వ వైవిధ్యం అనితరసాధ్యం. కులాంతరమనే తెర మరుగున రాగద్వేషాలకు దాసులైన నవ నాగరిక ప్రజలు, ప్రకృతితో కట్టిపడేసుకుని పెరిగిన పల్లె ప్రజల అమాయక మనస్తత్వాలు ప్రతి సంఘటనకూ చలించిపోయే అతిసున్నిత వ్యక్తిత్వాలూ రాక్షసత్వం రాసి పోసిన క్రూరాత్ములూ....యిలా రవీంద్రుని పాత్రచిత్రణలోని వైవిధ్యం 'ఒక మనిషి యిన్ని మనస్తత్వాలను ఇంత సమర్థవంతంగా యెలా చిత్రించగలిగాడబ్బా! అని ఆశ్చర్యంలో మునిగిపోయేలా చేస్తుంది. మనలను అతి సునాయాసంగా వారి కథా కథన చాతుర్యానికి లోబడేలా చేస్తుంది.

రవీంద్రుని మరోరూపం, సౌందర్యోపాసకుడు. ఆయన ప్రతి రచనలోనూ ఈ సౌందర్య పిపాస పఠితులను సమ్మోహితులను చేసి వారి పాదాక్రాంతులను చేస్తుంది. ఏ ఆభరణాలూ లేని నిర్మలమైన సౌందర్యంపట్ల వారికివున్న అనురాగం ప్రతి మలుపులోనూ ప్రత్యక్షమవుతుంది.

'అలంకార భారాలను త్యజించిన నా గీతం కాంచన పీతాంబర భూషణాలను సైతం ధిక్కరిస్తుంది, అంటారాయన. కానీ ఆ నగ్న సౌందర్యాన్ని సొంతం చేసుకోవాలన్న వాసనామయ వ్యక్తిత్వం కాదాయనది. అందుకే అంటారు 'సౌందర్యం వెలివిరిసే ప్రవాహంపైని చిరుకెరటాల్లా రేగే రంగుల అందాన్ని కన్నులారా చూచి ఆనందించు, అంతేకానీ ఆ రంగులను గుప్పిట్లో బంధించాలని ప్రయత్నించకు సుమా! అని హెచ్చరిస్తారాయన.



అద్వితీయ ప్రజ్ఞాశాలి. ప్రాక్పశ్చిమాలను సమానంగా ప్రేమించిన మహోన్నత మానవుడు. మానవలోకాన్ని ఒకే కుటుంబంగా భావించిన మానవతా వాది. మత భాషా సంప్రదాయాల సరిహద్దులను దాటి సర్వమానవాళికి సన్నిహితునిగా మెలిగిన అపూర్వ స్నేహశీలి. కవిగా తత్త్వవేత్తగా విశ్వమానవ శ్రేయోభిలాషిగా, శిక్షకునిగా, రవీంద్రుని సర్వతోముఖ ప్రతిభ ఆయన్ని 'విశ్వకవి'గా చేసింది. అందుకే ఆయన 'విశ్వమానవుడు' కూడా.

ఆకాశవాణి,
హైదరాబాదు.

— ○ —

# సౌందర్య రసైకజీవి కృష్ణశాస్త్రి

భావకవులందరు ఏదో ఒక ఊహా సుందరిని ప్రేయసిగా ఆరాధించారు. నాయని వత్సల, నండూరి ఎంకి, శివశంకరశాస్త్రి హృదయేశ్వరి, విశ్వనాథ కిన్నెరసాని, కృష్ణశాస్త్రి ఊర్వశి, బాపిరాజు శశికళ, అబ్బూరి అప్రాప్త మనోహరి, ఇలా ఆనాటి కవులకు సౌందర్య దాహాన్ని తీర్చిన అపురూప ఊహా సుందరీ మణులు చాలామంది ఆంగ్ల సారస్వతంలో వర్డ్సువర్తు, కీట్సు షెల్లీ ప్రభృతులతో కాల్పనిక కవిత్వం కొత్త వెలుగులు నింపింది. కాళిదాస కవీంద్రుని నాటకత్రయ ప్రభావంతో

'తృణకంకణం' రాయప్రోలు రాశాడని శివశంకరశాస్త్రిగారు రాశారు. కవితా సౌధం నూతన ద్వారాలు తెరిచారు. ఈ నూతన ద్యుతిలో కవులెందరో స్నపితులైనారు. అంతకంతకు నూతనమార్గం దీపావళీ విరాజ మానమై రాజ మార్గమయిందన్నారు.

భావకవిత్వానికి విశేష ప్రచారాన్ని చేసి తెలుగునాట దానికో విశిష్ట స్థానాన్ని కల్పించి, కవులను కవ్వించి, సమ్మోహ పరచి, ఆకర్షించి ఒక గొప్ప సంచలనం కలిగించినవాడు కృష్ణశాస్త్రి.

ఆధునిక సాహిత్యంలో కృష్ణశాస్త్రిస్థానం అతివిచిత్రం. అతివిశిష్టం. మానవతావాది. స్వేచ్ఛాప్రియుడు. 'కవిత్వం అతని వూపిరి. కవిత్వాన్ని బతుకుతాడు' చైతన్య నిశితం. అతని త్వగింద్రియం కూడా. వేలమైళ్ళ దూరాన వున్న గాలిని స్పృశించి పులకరిస్తుంది. తిలక్ కృష్ణశాస్త్రిమీద రాస్తూ 'త్రిమూర్తులు' కవితలో అంటాడు.

మల్లెపూలమీద పరుంటాడు,
మంచిగంధం రాసుకుంటాడు
మరిఎందు కేడుస్తాడు?
మంచిపనివాడు, మాకునచ్చినవాడు
మంత్రనగరానికి వెళ్ళొచ్చినవాడు

కృష్ణశాస్త్రి సౌందర్య రసైకజీవి, ఆయనది సౌందర్య విషాదబాధ. కన్నీరు పూజాద్రవ్యం, భౌతికంకాదు. హృదయ సంబంధి.ముక్కుతిమ్మన సత్యభామ ముద్దుముద్దుగా ఏడ్చింది. కృషశాస్త్రి అందాల ముద్దగా ఏడ్చాడు. అంత అందంగా ఏడ్చిన వారు భావకవుల్లో లేరు. శోకరస గంగాధర అని చెరుకువాడ వారు చమత్కరించారు. కృష్ణశాస్త్రి దుఃఖం ఆత్మాశ్రయమేకాదు. ఆనాటి లోక పరిస్థితులు కూడా కారణం. దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే రోజులు. స్వాతంత్ర్యకాంక్ష కవితల్లో ధ్వనిస్తోంది.

హిమాలయోన్నత పర్వత శిఖరాలనుండి జాలు వారిన కవితాగంగా సుధా స్రవంతిని తెలుగునేల దింపి కవితా క్షేత్రంలో పసిడి పంటలు పండించిన కృషీవలుడు కృష్ణశాస్త్రి.

కన్నుమూసే వరకు కలం వదలాలిత్వాన్ని సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని వదల్లేదు. రాసినా పలికినా చిందించిందిరసమే. జాలువారింది కవితామృతమే ఆత్మీయానుభూతి.

మెరుగుకళ్ళ జోళ్ళు సరదాలు గిరజాలు భావకవుల వేషధారణ అయింది. ఎందరెందరో ఆయన్ను అనుకరించారు. అనుసరించారు. యేట్స్‌రాసిన దిలేక్ అయిల్ ఆఫ్ ఇన్నిస్‌ఫ్రీ అంటే కృష్ణశాస్త్రికి ఎంతో యిష్టం. సముద్ర తీరంలో చిన్న మట్టితో కట్టినయిల్లు, పిచికగూడు, తేనెతుట్టె, పూలచెట్టు, సన్నని దారులు.

బాటలో నడచే మనుషులతో కరస్పర్శ, కేవలం ప్రకృతేకాదు మనషులు కూడా కావాలి కృష్ణశాస్త్రి కి. రవీంద్రుని సంత బాటలో యిల్లు గుర్తొస్తుంది. తోటమాలి రవీంద్ర కవీంద్రుని గీతామృతాంజలి ఆయనకు అభిమానపాత్రం.

సౌందర్య ప్రకృతితోను, మానవునితోను ఆయనకు నిత్య సంబంధం, తాదాత్మ్యం. రాసింది రాశిలో చిన్న అయినా వాసిలో మిన్న.

తుమ్మలవారి విధంగా చెప్పారు.
కరుణ కలదు ప్రేమకల దీపికల దాత్మ
కలదు కృష్ణశాస్త్రి కవితయందు
టన్ను బరువు దానికున్నదాయని నొస
లెత్తి యడుగు వానికేటికోళ్ళు?

వెలుగును, ప్రేమను ప్రకృతి అణువు అణువులో దర్శించాడు, వర్డ్స్‌వర్తు, షెల్లీ కవుల్లో తాత్విక సందేశమూ, అర్థమూ స్ఫురిస్తాయి. కీట్సులో పృథ్వీ కవిత వినిపిస్తుంది. కీట్సుతిరుగుబాటు దారుడు కాడు, ఊహాస్వాప్నికుడూకాడు, షెల్లీ ఆదర్శ విప్లవ వాది, కవితాప్రవక్త. కృష్ణశాస్త్రి వర్డ్స్ వర్తు, షెల్లీ కీట్సుకవులను చదివి అర్థంచేసుకు న్నాడు. అందుకే వారి కవిత్వప్రభావం కనిపిస్తుంది.

కృష్ణది దివ్య సౌందర్యానుభూతి. విప్రలంభ శృంగారం ఆత్మాశ్రయం సౌందర్య పరసీమ ఆవి ష్కృతం అనంత రూపాలెత్తిన పదజాలం. రఘుపతి వెంకటరత్నంగారి పాద సీమ నుండి జాలువారిన ప్రణయమందాకిని నదిని భువికి దించిన భాగీరథి కృష్ణశాస్త్రి. ఈశ్వరుడు జగ న్మోహినిగా రూపొందాడు. భక్తి రక్తిని రంగ రించుకుంది. వియోగ మదుర బాధ హృదయా గాధంగా విపర్యయం పొందింది.

వర్ణనా వైచిత్రికి శబ్దమార్దవానికి భావ కవి త్వానికి పర్యాయపదం కృష్ణశాస్త్రి, నవయుగ కవితా ప్రాంగణాన ఉదయించిన వెలుగు కిరణం. కృష్ణశాస్త్రి కవిత్వం గురించి చక్కగా చెప్పిన కె.వి.ఆర్. క్షణ కవిత్వంగా కూడా పేర్కోడం జరిగింది తరవాత. ఉదాత్త శృంగారం అభ్యుదయ కవిత్వంలో లోపించడం వల్లనే శుష్కించిందని గుర్తించలేక పోయారు. మానవ జీవితంలో అత్యంత ప్రధానమైన హృదయానుభూతిని కవిత్వం నుండి వెలివేయడం భావ్యంకాదు.

కృష్ణపక్షం సింహావలోకనంలో నాలుగు పాయలు గుర్తించాడు శివశంకర శాస్త్రి. 1. స్వేచ్ఛాప్రియత్వం 2. దుఃఖం 3. ప్రేమ 4. ఈశ్వరారాధన. గురుదేవులు బ్రహ్మర్షి వేంకట రత్నముఖోద్గత ఆంగ్లసూక్తుల్ని ఋగ్వేది పేరుతో అనువదించాడు. బ్రహ్మర్షి మీద రాసిన పద్యాలు రసగుళికలు. 'నా యెదలో త్వదీయ చరణమ్ముల చిహ్నములెన్నడే నియున్ మాయవ యేనిశితపు దమస్సులు మూసినగాని అన్నాడు. దినదినయాత్రా కృతోత్సవానుభూతి నొసగే బ్రహ్మర్షి. ఆనాటి కవుల మనోమందిరాల తలుపులూ కిటికీలు ఒక్కసారి తెరిచి వెలుగులూ గాలులూ లోపల ప్రవేశ పెట్టారు.

కృష్ణశాస్త్రిగారు ఎవ్వరూ చేయని నవపద నిర్మాణాలు చేశారు. ఏది రాసినా అందంగా వుండా ల్సిందే. చంధస్సులోగాని వచనంలోగాని భావ వ్యక్తీకరణకు అడ్డురాలేదు. ప్రవాహ సదృశంగా సాగిపోతుంది. కృష్ణశాస్త్రి కవితాత్మను సోమ సుందర్ ఆవిష్కరించాడు. ఇస్మాయిల్ గారు కృష్ణశాస్త్రిని గురించి మంచి వ్యాసం రాశారు. ఎందరు రాసినా ఇంకా మిగిలే వుంటుంది. కృష్ణ శాస్త్రి పరిపూర్ణ జీవి. వైష్ణవ భక్తి సంప్రదాయ ప్రభావం బాగా వుంది. గాంధీ, అరవిందుడు, రవీంద్రుడు—ఈ త్రివేణీ సంగమంతో భారతీయ సంప్రదాయం నవనవోషమై వెలుగులు విర జిమ్మింది. విశ్వవిశాల దేవాలయంగా పరిణతి చెందింది. కృష్ణశాస్త్రిలో ఇవన్నీ కలిసి లోలోన కదలిపారి పదునువారింది.

భావకవిత్వంలో సంగీతానికి కవిత్వానికి సమప్రాధాన్యత నిచ్చారు' జర్మన్ కవిగెటేలో రొమేంటిక్ ఛాయలున్నాయి, జర్మన్ జాతీయ కవేకాదు. మానవీయకవి, అందుకే ఎగెల్స్‌గెడ్ మీద బృహద్వ్యాసం రాశాడు, ఉన్నత ఆత్మచైత న్య సాహిత్యోద్యమం భావకవిత్వం. అందుకే నవ్విపోదురు గాక నాకేటిసిగ్గు అనగలిగారు.

రాజవీధులరత్నాలరథంలో వెళ్ళే నిర్జీవపాషాణ విగ్రహాన్ని చూపించాడు; వినిపించని గీతాలను మధురాతి మధురంగా వినిపించారు.

ఆకాశము నొసట పొడిచె అరుణారుణతార
అది గదిగో స్వాతంత్ర్య రథం
జయ జయ ప్రియభారత జనయిత్రీ

వంటి జాతీయ గీతాలు శక్తివంతంగా మధురంగా రాశాడు, ఏదో అపూర్వమధురశక్తి స్ఫురియించు గాని అర్థంగాని భావగీతమ్ములు, పాఠకుడు ఊహించుకోవాల్సిందే ఒక భావంచుట్టూ అల్లిన గీతాలు కాదు. ప్రకృతి అంతాచైతన్యవంతంగా కనిపిస్తుంది. సన్నగా ఎల్గెత్తి జాలిగాపిచే యమున మొందిచేరులనెత్తి యావనతరుల్ శూన్య దృక్కుల దిశలు చూడటం వంటి వర్ణనలు రవీంద్రుని గుర్తుకు తెస్తాయి.

నీలాభ్ర సరనిలో జాబిల్లి
రాయంచవలె విహారము సల్పు చుండె
కమ్మతెమ్మెరలు శాఖాపత్రములనొ
కల్లోలినీ తరంగమూలనోడాగె
నాట్యంబు మధురగానంబునుమాని
గాటంపు నిద్దురగాంచెశైవలిని
సర్వేశ్వరుని హస్తజలజయుగ్మమున
విశ్వమేహాయిగా విశ్రాంతి జెందె!

ఈ 'విశ్రాంతి' కవిత ప్రశాంతస్థితి రాసిందేమో అద్భుతంగా వెలువడింది. మనకు చదివేక ఎంతో హాయి అని పిస్తుంది. ఇంత చక్కని కవితలు ఎక్కువలేవు. ఎండి దాహానబీటలు వారిన బ్రతుకులను— చలువపాట మంచుకన్నీరు పాట గాలినీలాలపాటనెత్తావికలలపాట-యివన్నీ కలసి తడిపి అలల నుప్పొంగి మధురమైన ఆశ కల్పిస్తాయి, కృష్ణపక్షం, ప్రవాసము, ఊర్వశి ఈ మూడు కృష్ణశాస్త్రి కృతులు. ఇంకా పాటలు, నాటికలు వ్యాసాలు వ్రాసి తెలుగు కవిత్వాన్ని సుసంపన్నంచేశారు.

# పుస్తక సమీక్ష

## కృష్ణ గీతాలు

మన తెలుగు సాహిత్యంలో భాగవత సంప్ర దాయమునకు ఓ ప్రత్యేకత ఉంది. కృష్ణ భావన రాగానే మనం పరవశించి పోతాం. కృష్ణగీతం అన గానే వేణువు, రాధ, గోకులము గుర్తుకు వస్తుంది. సహజంగా 'రాధ' ప్రసక్తి శ్రీనాథుని కాలమునుండి మన తెలుగు సాహిత్యములో కనబడుతున్నను 18వ శతాబ్దములో రాధను పరనాయికగా కేవలం శృంగార నాయికగా వర్ణించినా, 19వ శతాబ్దం చివరలో జయదేవుని గీత గోవిందము, 20వ శతాబ్దము తొలినాళ్ళలో వచ్చి రాధా మధుర సంప్ర దాయముతో 'రాధ' అనగానే మధురభావనకు, ప్రేమరసాజ్ఞగాను, 'రసోవై సః' అన్న నానుడికి ప్రత్యక్షంగా మనభావకవులు రాయప్రోలు విశ్వనాథ వారు, బుచ్చి సుందర రామశాస్త్రి తదితరులు రాధాకృష్ణ భావనలకు ఓ చక్కటి మధురానుభూతి కల్పించారు. 1904–5లలో వచ్చిన పానుగంటివారి రాధాకృష్ణ నాటిక గూడా ఇందుకు ఆదర్శంగా ఉంటుంది.

**రచయిత: వడకుదురు. రాధాకృష్ణ కవి**

**ప్రతులకు: రచయిత, బ్రాహ్మణవీథి, పొన్నూరు–521124, గుంటూరు.**

**ముద్రణ: 1987.**

**పుటలు: 118.**

**వెల రూ. 6/–**

తరువాత వచ్చిన భావకవులు రాధ భావనను మరింత ఉద్దీప్తం చేసారు. ఈ రాధా సంప్రదాయం శృంగారమునకు ప్రతిబింబంగా భావించినప్పటికి భక్తులు తామే రాధకు ప్రతిబింబమయి గోపికలయి భావకవితా విహాయసంలో విహరించినారు. ఇందులో భాగంగానే వడకుదురు రాధాకృష్ణకవిగారు కృష్ణ గీతాలను అల్లారు.

ఈ కృష్ణ గీతాలు అభ్యర్థన, ఆవేదన, ఆరాధన అను మూడుభాగాలుగా విభజించారు. వానిని చూసినప్పుడు విశ్వనాథవారి గోపికా గీతలలోని చింత, అన్వేషణ, సాక్షాత్కారములు మనకు గుర్తు వస్తవి. అలాకాకుండా వాటిని ఆలోచన, ఆర్తి అనుభూతిగా భావించవచ్చును.

'మధుర ప్రేమకు దూరమై మసలుచుంటి
గుండె కుంపటి కాజ్యమై కోలుకోకుండె'

'మనసు మనసున నుండెడి మధురరూప
కంటికగుపింపకుండుటే కొంటెతనము'

'మమతభావనకు మనసు మరలనరో
దేహమెడపిన కాయాత్మ అరిగి పుట్టు'

ఇవి అభ్యర్థనా ఖండము లోనివి ఆయితే—

'మోహన మురళి రవళిలో ముగ్ధ నగుచు
సుర నర ఖగ పశు భుజగస్తోమ మటుల'

'వర్తమానమ్ము నా నుండి వచ్చుననుచు
ఆ మనోనేత్రాల యీ రాధ- అరయుచుండు'

'కలిసి యున్న నాటి కథలె వియోగాన
సుఖము నిచ్చుచుండె శోకమందు'

అని 'ఆవేదన' ఖండములో చెప్పారు.

కృష్ణతత్వములో 'ఆరాధన' అనునది అనుభూతితో కూడుకొని ఉంటుంది. ఆ 'ఆరాధన' ఇందులో మరింతగా ప్రకాశించిందిలా-

'రమ్య గోలోక మందున రాధ నేను
విరహ మనుభవింప తరమా! విడిచి నిన్ను'

'కనుల లోపలె భవనమ్ము కట్టుకొంటి
తప్పపాటున బంధింప తెప్పలందు'

'ప్రేమతత్వమ్ము పెంచిన ప్రియుడ నీవు
విశ్వప్రేమను పంచెడు ప్రియను నేను'

'మురళినాదంబు వినినంత ముదము తోడ
నాట్యమాడును హృదయమ్ము నానలేక.'

నడకుదురు రాధాకృష్ణ కవి గారి కవిత్వములో రాధాకృష్ణుల ప్రేయసీ తత్వము నింగి కెగసి దుమికినది. అంతేకాకుండా మధురభక్తికి ఆటకొమ్మయై వెలుగొందినది. రాధాకృష్ణ కవి గారి ఆంతర్యము ఒక మధురమైన అనుభూతిని, భావనను పొంద వచ్చును ఈ కావ్యం చదివిన తరువాత.

టి. శ్రీరంగస్వామి
విద్యారణ్యపురి, వరంగల్.

# శ్రీ రామచంద్ర దివ్యకథ
## (నిర్వచనము)

ఎన్నిసార్లు విన్నా, చదివినా తనివి తీరని మధుర రామాయణ గాథ ఇందులో ఉంది. ఇది కవి గారి ప్రథమ రచన అయినప్పటికీ చక్కగా ఉంది.

వారు

'రమ్యపదముల నొసగుచు రాణకెక్క
నన్ను నాశీర్వదింపుమో నలువ రాణి'

అని సరస్వతీ దేవిని ప్రార్థించారు. ఆమె కరుణించి, అన్నీ అందమైన పదాలనే వారి పద్యాలలో కుమ్మరించింది.

ఈ కవి గారికి పూర్వపు కవుల పట్ల వినయం గౌరవం కొల్లలుగా ఉన్నట్లున్నాయి. వారి దీవెనలు అర్థించడం చాలా బావుంది. చదవండి.—

సరస కవితా మహీరుహ శాఖ లెక్కి
రామ రామా యటంచును రమ్యమైన
మధుర కవితమ్ము వ్రాసిన మాన్యవరుడు
పరమ పూజ్యుడు వాల్మీకి ప్రస్తుతింతు'

అన్నారు.

ఈ గ్రంథం చదువుతూ ఉంటే మొల్ల రామాయణం చదువుతున్న అనుభూతి కలుగుతుంది. మొల్ల రచనా ప్రభావం వీరిపై పడినట్లు తోస్తుంది. 45 వ పేజీలో

'నీల మేఘ ఛ్ఛాయ బోలు....
వరలు సౌమిత్రి బంగరు వన్నె తోడ....
వంటివి కొన్నిచోట్ల కనిపిస్తాయి.
వీరి దృశ్య చిత్రణం కూడా బావుంది.

ఉదా : లంకలో వానరం అల్లరి.

వీరి పద్యాలు చదువుతుంటే లలిత మైన గేయాలు చదువుతున్నట్లనిపిస్తుంది.

1) సుగ్రీవుడని గాంచి హరత్వ మొప్పార
2) సంతోషమును బట్టజాలక సంద్రుండు

గ్రంథకర్త: శ్రీ ఆలపాటి రాధాగోపాలకృష్ణ
పేజీలు: 145
వెల : అమూల్యం

3) కోపమందియు తాను కోదండమునుబట్టి
4) మానవ రూపంబు మహితను దాల్చి

ఈ కావ్యకన్య వారి ఆరవకూతురట, ఆమెను శ్రీరాముని కిచ్చి వివాహము చేస్తున్నారట!

అక్కడక్కడ అచ్చుతప్పులున్నా ముద్రణ బావుంది. అక్షరాలు అందంగా, చక్కగా, స్పష్టంగా కనిపించి చదవబుద్ధివేస్తుంది.

మరీ అర్థంకాని పదాలు లేవుకనుక మామూలు పాఠకులకు కూడా అర్థమవగలవు. ఆ సందేశాలను అందించగలవు.

విజయ సర్వాణి

# మధుశాల

ఉమర్ ఖయాం రుబాయీలను తెలుగులో అనువదించడమేకాక అనుసరించడం కూడా జరిగింది. కరుణశ్రీగారి ఉమర్ ఖయాం ఇందుకు ఉదాహరణ. శ్రీ దత్తప్రసాద్ ఉమర్ ఖయాము రుబాయీలను ఆదర్శంగా తీసుకొని ఈ మధుశాల సొంతవాణిలో, సొంతబాణిలో సంతరించారు. శ్రీ దత్తప్రసాద్ 'గుండె లోతుల్లో' అనే తమ ముందు మాటల్లో ఈ రీతిగా చెప్పుకున్నారు.

'గుండెలోతుల్లో అనంతమైన సంఘర్షణ.... ఏ గుండెలో తొంగి చూచినా వేదనలే. ఏ ప్రాణిని పలుకరించినా రోదనలే విశ్వమంతా యాతనామయమే....ఎంత చిత్రమైన జీవితం? ఎంత విచిత్రమైన సృష్టి?....వీలైతే సృష్టికర్తను విశ్వభర్తను నిలబెట్టి నిగ్గదీసి ఎన్నో ప్రశ్నలడగాలని ఉంది.'

కవి యొక్క ఈ అంతస్సంఘర్షణకు ఫలితమే ఈ కావ్యం. కవి యెదలో మెదలే ప్రశ్నల పరంపరయే ఈ కావ్యం.

ఇందులో ఐదు విభాగాలున్నాయి. అవి 1. 'అమ్మా భారతి 2. నేను గూఢార్థతత్వార్థినై 3. వినుమోదేవర 4. ప్రాణ సఖా! పరమాత్మ వీవెగా 5. సాన్నిధ్య మిప్పింపవే.

మొదటి విభాగంలో మూడు పద్యాలు మాత్రమే ఉన్నాయి. అవి ఎంతో హృద్యంగా ఉన్నాయి. అవి భారతీదేవిని ప్రార్థిస్తూ చెప్పబడినవి. మచ్చునకొక పద్యం.

'అమ్మాభారతి! నామనోం బుజము నీ
రాకన్ నిరీక్షించె, చే
కొమ్మా నీదుపయోధరమ్ము లెసగన్
క్రొంగ్రొత్త కావ్యంబులన్
సమ్మానించెద నిన్ను చిత్రముగ నా
శ్వాసల్ గుబాళింపగన్
లేమ్మా భారతి! పానశాల భువి
లాలింపన్ ప్రబోధింపవే'

'తల్లీ! నీస్తన్యపానం చేతనే కవినై పానశాల సంతరించాను. ఈ కృతిని లాలించవలసింది.

అంటూ ప్రారంభించాడు కవి. ఇది ఎంతో భావ యు క్తంగా ఉంది.

గూఢార్థతత్వార్థినై' అనే రెండవ విభాగం ఖయ్యాం రుబాయీలవలె గూఢార్థ బంధురమై ఉన్నది. భగవంతుని సృష్టి తెలియరానిదై మార్మికత కలిగి యున్నది. సామాన్యులకు అర్థంగాని రీతిలో ఉన్నది. అట్టి గూఢార్థ తత్వాన్ని తెలుసుకొనగోరి కవి సృష్టితత్వాన్ని అనేక విధాలుగా భావించడం జరిగింది. విశ్వం ఒక విలాసభవనంగా ఉన్నదని కవి చెప్పిన ఈ పద్యం గమనింపదగినది.

"విశ్వమ్మొక్క మహావిలాసభవనమై విభ్రాంత
విఖ్యాతమౌ
విశ్వైకాకృత సృష్టి, సౌఖ్యముల
తావేయంచు తాపత్రయిన్
శశ్వద్భ్రాంతిని జీవకోటి వివి
ధాశాపాశసముగ్రమై
విశ్వాసమ్మగ కామనాట్యముల
వై విధ్యముగా సేయునే॥
(పే.4.ప.8)

విధాత భువనాలను పనిలేక సృజించాడా? మూర్ఖుడై ఓర్పులేక మాయాబలోన్మత్తుడై ఈ జగత్తును సృష్టించాడా? (ప.15.ప.1) అని నిగ్గదీస్తున్నాడు కవి. అటువంటప్పుడు జనన మరణాలెందుకని ప్రశ్నిస్తున్నాడు.

"రక్షంబూనికి విశ్వమందు గల సందేహంబు దార్పంగ" అంటూ గూఢార్థతత్వాన్ని తెలుసుకొనడానికి పట్టుదలతో ప్రయత్నిస్తున్నాడు కవి. 'కవితావేశము గట్టుతప్పెనుర గంగాతీర ముప్పెంగె" అంటూ కవి తన కవితావేశాన్ని ప్రకటిస్తున్నాడు. కవితా రచనకు ఆవేశం ఒక ముఖ్యగుణంకదా!

మనసది కోతివంటిదట
మానవ జన్మవనాంతరంబునన్
కనపడు పువ్వునెల్ల తన
కంటికి నచ్చిన త్రుంచిపోయు"
"మనసే మాయలగుట్టమై
నిలోనగన్'' అంటూ మనసు గతినీ, స్థితిని వ్యంగభంగిమతో వెల్లడిస్తున్నాడు.

ఈ విధంగా ఈ విభాగంలో సృష్టిలోని గూఢార్థాన్ని, జీవిలక్షణాన్నీ పలువిధాలుగా చిత్రిస్తున్న వైనం కనపడుతుంది.

"నిలుము దేవర, కల్పనా కలితమౌ నృత్యమ్ము లొక్కింత/నీమకన్ చెందక నిలువమోయి,'' అని 'నిలుమోదేవర' అనే మూడవ విభాగం ప్రారంభించబడినది.

''ఆవేశమ్ముల నుగ్గబట్టి మన లోపాలోపముల్ తేలగా రావచ్చునేగద శాంతి చర్చలకు'' అంటూ సృష్టికర్తకు మనవిచేస్తున్నాడు. కవి ''ఏమైనన్ నిను వీడబోను మరి నా కేమైన కానిమ్ము" అని కవి తన నిశ్చయాన్ని వెల్లడిస్తున్నాడు.

''ప్రాణసఖీ! పరమాత్మనీవెలే'' అనే విభాగంలో పరమాత్మను ప్రాణసఖిగా భావించి కవి రకరకాల భావాలను ప్రకటించాడు.

---

శతమాత్మని శ్రీదత్తప్రసాద్
వెల: అమూల్యం.
ప్రతులకు: డా. ప్రసాదరాయ కులపతి.
విద్యాపీఠాధ్యక్షులు, శ్రీనాథ పీఠము,
1-4, బ్రాడీపేట, గుంటూరు-2.

''నీదయ చాలునే ప్రణయినీ! భవ సాగర మీదనెంతు' అని ''దోయిలినొగ్గినాడను మధూళి నౌసంగుమ' అనీ 'చెలియా! నీ అధరోష్ఠ శధువునునే శీఘ్రంబు గ్రోలంగనీ. పలుకం జెందకు' అనే ప్రాణసఖి ప్రతీకగా పరమాత్మను గూర్చి ప్రణయ మాధుర్యాన్ని ప్రకటించాడు కవి. ఈ లాంటి మధుర భావ సన్నివేశాలు ఈ విభాగంలో కనపడతాయి.

'సాన్నిధ్యమిప్పించవే' అనే చివరి విభాగంలో భారతీ దేవిని తల్లిగాను, తనను తనయుని గాను భావించాడు కవి.

'ఎన్ని యుగంబులందు తపి
యించి శ్రమించి మనమ్ము నిల్ప నీ
చెన్నగు పాదయుగ్మమున
శీర్షము చేర్చు నదృష్ట మబ్బె, నీ
సన్నిధి నాకు పెన్నిధి
నిజమ్మగు మన్నన, కన్నబిడ్డ నిం
కెన్నడు వీడకమ్మ, చరి
యింతు భవత్కరుణాలమంబున్''

అని భారతిని ప్రార్థించాడు. ఈ విభాగంలో ఎంతో ఆర్ద్రత కనపడుతుంది.

శ్రీ దత్తప్రసాద్ పద్యశైలి ధారాళమై హృద్యరీతిలో సాగింది. ఇందుకు ఒక ఉదాహరణ.

'చాలా! ఎవ్వరి కెవ్వరుందురిట
ఎవ్వారైన కాలాంగనా
లీలా లాస్య విలాస వైభవములన్
లే ప్రొద్దు నాట్యంబులన్
డోలాయాన విలీన హర్షములు
నుద్వోలమ్ము సేయంగ, ధీ
రా లాపమ్ముల రేగి రేగి త్రుటిలో
అజ్ఞాతమున్ జేరరే'

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య ఎస్వీ జోగారావు, కరుణశ్రీగారు కావ్య తత్త్వాన్ని అద్దంపట్టి చూపే చక్కని పీఠికలు వ్రాశారు. ఈ కావ్యం డా. ప్రసాదరావు కులపతిగారికి అంకితం ఇవ్వబడినది.

**వేముగంటి**
సిద్దిపేట.

# వార్తా వాహిని

## ప॥గో॥ జిల్లా హిందీ ప్రచారక మండలి స్నేహసభ

పెదపాడు జిల్లా ప్రజాపరిషత్ హైస్కూలు ఆవరణలో శ్రీ సోమేశ్వరరావు, ఉప-ప్రధానోపాధ్యాయుల అధ్యక్షతన హిందీ కార్యకర్తలు ఉపాధ్యాయుల మరియు విద్యార్థినీ-విద్యార్థుల స్నేహ సమావేశము ది. 25-3-1992 సాయంత్రము గం. 4-30 ని॥లకు జరిగినది.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులు జి. వెంకటాచార్యులు మరియు శ్రీ వెల్లా పాండురంగారావు, ప్రచారక మండలి అధ్యక్షులు ముఖ్య అతిథులుగా వేదిక నలంకరించిరి.

శ్రీ కోటేశ్వరరావు, హిందీ పండితులు హిందీ స్వాగత వచనము పలికిరి. శ్రీ ఆంజనేయశర్మ సంస్కృతములో అనర్గళముగా ప్రసంగించి ఆహూతులను ఆనందపరిచిరి.

వసంతవాడ, సత్యవోలు మరియు పెదపాడు బాలబాలికల ఉపయోగార్థము హిందీ ప్రచారసభ పరీక్షాకేంద్రము ప్రధానోపాధ్యాయులు శ్రీరామబ్రహ్మం గారి అనుమతితో నడుపుటకు నిర్ణయించామని హిందీ విద్యాలయ కమిటీ సభ్యులు శ్రీ జి. వెంకటాచార్యులు తెలియజేసారు. శ్రీ కత్నేని జ్ఞాన సుందరి కోటేశ్వరరావు, భారతి హిందీ వేసంగి శిబిరం నడిపి పిల్లలకు హిందీ బోధన చేసెదమని ఈ అవకాశమును వినియోగించుకోమని సభలో విజ్ఞప్తి చేసారు.

హిందీ ప్రచార మండలి నాయకత్వంలో విరివిగా హిందీ ప్రచారం చేయాలని ముఖ్యంగా గ్రామంలోనున్న బాలబాలికలు అదే గ్రామములో హిందీ నేర్చుకొనుటకు మరియు అచటనే యున్న హైస్కూలులో పరీక్షలు వ్రాయుటకు వీలుగా ఏర్పాట్లు ప్రచారక మండలి ద్వారా చేస్తున్నామని శ్రీ వెల్లా తమ హిందీ ప్రసంగములో చెప్పినారు.

ఉచిత హిందీ పాఠశాలలు నడుపు కార్యకర్తలను పరీక్షా కేంద్రము నడుపుటకు బాధ్యత తీసుకున్న ప్రధానోపాధ్యాయులకు ప్రచారక మండలి వారు కృతజ్ఞత తెలియజేయడంతో 'స్నేహసభ' ముగిసినది.

## ప్రమాణపత్ర వితరణోత్సవములు

### ఏలూరు

పశ్చిమగోదావరి జిల్లా హిందీ ప్రచారక మండలి, ఏలూరు ఆధ్వర్యంలో శ్రీ కె. వీరభద్రరావు, ప్రధానోపాధ్యాయులు వారి అధ్యక్షతన

వైభవముగా పిల్లల ఉత్సాహ తరంగాల మధ్య శనివారపుపేట జిల్లా ప్రజాపరిషత్ హైస్కూలులో ఉత్తీర్ణులైన హిందీ విద్యార్థులకు ప్రమాణపత్రములు యివ్వబడినవి. ముఖ్య అతిథులుగా వచ్చిన ప్రచారక మండలి ప్రముఖ కార్యకర్తలు సర్వశ్రీ వెత్సా పాండురంగారావు జి. వెంకటాచార్యులు, బి. విశ్వనాథాచారి,వి.వి. సుబ్రహ్మణ్యం ప్రసంగించిరి. శ్రీ విశ్వనాథాచారి శ్రీశ్రీ కవిత 'శైశవ గీతము'ను హిందీలోనికి అనువదించి చదివి వినిపించి ఆంధ్ర బాలబాలికలు హిందీలో కవితలు వ్రాసే స్థాయికి ఎదగాలని ఉద్బోధించిరి. ఈ సందర్భములో హైస్కూలులో 'పఠనాలయము' ప్రారంభించడం, దానికి బాల సాహిత్యాన్ని, నిఘంటువులను ప్రచార మండలి తరపున యిచ్చెదమని మరియు హిందీ పద్య పఠన పోటీలో విజేతలకు బహుమతులు యిచ్చెదమని శ్రీ వెత్సా పాండురంగారావు వాగ్దానం చేసారు. వేసంగి పాఠశాల శనివారపుపేటలో నడుపుటకు సత్యవతి మరియు ఆండాల్ తాయారు గార్లు బాధ్యతను సంతోషంగా స్వీకరించిరి. ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వీరభద్రరావు, తెలుగు పండితులు ఉపన్యసించిరి. శ్రీమతి జి. సత్యవతి గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## నెల్లూరు

తే.1-2-92 సాయంకాలం స్థానిక మూలపేటలోని శ్రీ వాణీ హిందీ విద్యాలయం ఆవరణలో 19వ బ్యాచి విద్యార్థుల 'ప్రమాణపత్ర వితరణోత్సవం' జరిగింది. 1991 ఫిబ్రవరిలో దక్షిణ భారత్ హిందీ ప్రచారసభ, మద్రాసు వారి పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థుల ప్రమాణపత్రములను ముఖ్య అతిథులుగ విచ్చేసిన శ్రీ ఉప్పల వేంకట సుబ్రహ్మణ్యం (ఇన్‌చార్జి ప్రిన్సిపాల్, వేద సంస్కృత కళాశాల, నెల్లూరు) గారు, విద్యార్థులకు అందచేసారు. ముఖ్యఅతిథి మాట్లాడుతూ హిందీ జాతీయ భాష అని దానిని విద్యార్థి దశలోనే నేర్చుకొని భారతీయ ఐక్యతను కాపాడాలని, విద్య నిగూఢమైన ధనమని విద్యార్థులకు హితవు బోధించారు.

సభాధ్యక్షులుగా వ్యవహరించిన డా॥ అమృతవాక్కుల శేషకుమార్ (లెక్చరర్ వేద సంస్కృత కళాశాల, నెల్లూరు) మాట్లాడుతూ ఈ హిందీ విద్యాలయం 1982లో ఆరంభింపబడి సాహిత్యసేవ చేసిందని వివరించారు.

స్వాగత భాషణము విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీమతి ఎ. చంద్రకళ చేసినారు.

విద్యార్థుల సాంస్కృతిక కార్యక్రమములు సభాంతమున కన్నులవిందు చేసినవి.

## రాజోలు

1991 సం॥రములో రాజోలు స్థానికోన్నత బాలుర పాఠశాలలో నిర్వహింపబడిన ఫిబ్రవరి, ఆగస్టునెలలో విజయం పొందిన వారికి హిందీ ప్రమాణ పత్రములు అధ్యక్షుల వారిచే బహూక

రింప బడినవి. వారు రాజోలు కేంద్ర ప్రగతిని గూర్చి మాట్లాడిరి. శ్రీ డి. వి. సుబ్రహ్మణ్యంగారు. 1949 ఆగస్టు నుండి ఈనాటి వరకు నిర్విఘ్నంగా జరుపబడుచున్న పరీక్షా కేంద్రాన్ని గూర్చి ప్రముఖ సీనియర్ ప్రచారకులు శ్రీ బూడిద సత్యనారాయణమూర్తి గారి సేవా నిరతిని, పట్టుదలను దీక్ష అనన్య కృషిని పలువిధములుగా ప్రశంసించిరి. శ్రీ అబ్బాయిగారు హిందీ యొక్క ప్రాముఖ్యాన్ని వివరించారు.

అధ్యక్షులు శ్రీ.కె. నాగేశ్వరరావుగారు ప్రిన్సిపాల్, గనవర్నమెంటు కాలేజీ, ముఖ్యవక్తలు శ్రీసిచ్. శ్రీరామచంద్రమూర్తిగారు ప్రధానోపాధ్యాయులు జడ్. పి. పి. (బి) హైస్కూలు శ్రీ టి. భాస్కరమ్మగారు ప్రధానోపాధ్యాయిని జడ్.పి.పి (జి) హైస్కూలు, శ్రీ డి.వి. సుబ్రహ్మణ్యం గారు శ్రీ అబ్బాయిగారు. హిందీ లెక్చరర్ గార్లు సభలోపాల్గొనిరి.

రాజోలు కేంద్రంలో ఇటు వంటి సభ జరుపబడుట ఇదియే ప్రథమం. దీని అందరు హిందీ పండితులు, పురజనులు ఎంతో సహకరించిరి.

సభానంతరం సీనియర్ హిందీ పండిట్ శ్రీ బి. మహేశ్వరావుగారి వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసినది.

## అనకాపల్లి

తే 7-5-92ది సానిక లింగమూర్తి హాలులో శారదా హిందీ విద్యాలయం, చిన్నవీధి ఉచిత హిందీ పాఠశాల, గవరపాలెం, జయభారత హ్యిదీ విద్యాలయం వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవ కార్యక్రమములు ఏర్పాటు చేసిరి. హింది ప్రచారక్ పి.ఎన్. జగ్గారావు ఆహూతులకు స్వాగత వచనములు పలికిరి. డా॥పి. త్రిమూర్తిగారు సభాధ్యక్షత వహించి బాలబాలిలు ఉత్సాహంతో హిందీ మాట్లాడే విధంగా బోధన జరపాలని తెల్పిరి. రొటేరియన్ పి. సర్వేశ్వరరావు, హిందీ భాష జాతీయ సమైక్యతకు నైతిక విలువం వృద్ధికి తోడ్పడునని పలికిరి.డా॥ఎం. శివప్రసాదరావు, 'హిందీ బోధనకు అనకాపల్లి విశిష్ట సేవలు' చరిత్రలో నిలువాలని, శ్రీ మళ్ల రామప్పారావుగారు, హిందీ నేర్చుకొని, తమలో జ్ఞానజ్యోతుల ప్రకాశం సంతరించుకోవాలని వివరించిరి. శ్రీ ఎల్. ఎన్. ఆర్. శాస్త్రి గారు ప్రసంగించారు.

శారదా హిందీ విద్యాలయం కార్యదర్శి శ్రీ డి. వెంకటేశ్వరరావు గారు, తమ విద్యాలయ వ్యవస్థాపకులు శ్రీ కె. సుబ్బరాజు ప్రభృతుల సేవలను కొనియాడిరి. సేవాభావంతో విద్యార్థులు చేస్తున్న కృషిని పొగడిరి.

చిన్నవీధి హిందీ విద్యాలయ హిందీ ప్రచారక్ పి.ఎన్.జగ్గారావు, తమ విద్యాలయ ప్రోత్సాహకులకు, సానిక యాజమాన్యల వారి సహకారములకు తమ కృతజ్ఞతలు తెల్పిరి.

శ్రీ పి. సుబ్బారావు హెడ్‌మాస్టర్ శ్రీ కె.నారాయణరావు, హెడ్‌మాస్టర్, హిందీపరీక్షలలో ఉత్తీర్ణులైన, బాలబాలికలకు సర్టిఫికెట్లు అందజేసిరి.

ముఖ్య అతిధి శ్రీ జి.కన్నబాబు వివిధ పోటీలలో (హిందీ వ్యాసరచన దస్తూరీ పద్యపఠనం) విజేతలైన పి.నరేన్‌వర్మ, పి.వి.శాంతకుమార్, బి. రవికుమార్, స్వాతి, కె.వరహాలక్ష్మి, పి.సువర్ణ, జి. అమ్మాజీ. మొదలగువారికి ప్రథమ, ద్వితీయ

తృతీయ బహుమతులు ఇచ్చిరి. స్థానిక మురళీకృష్ణా బుక్ స్టోర్స్ వారు శ్రీ పి. గోపాల్, పరీక్షలు పాసైన వారికి ప్రోత్సాహకరంగా పెన్నులు బహూకరించిరి.

పుర ప్రముఖులు రోటరీ చైర్మన్ శ్రీ కె. రామునాయుడు, మునిసిపల్ కౌన్సిలర్లు శ్రీ ఆళ్ళ అప్పారావు, శ్రీ డి.వి.కృష్ణారావులు కార్యక్రమములకు ప్రోత్సాహమిచ్చిరి.

శ్రీ బి.మహాలక్ష్మినాయుడు, బీ ఇడి.టీచర్ వందన సమర్పణతో నాటి కార్యక్రమం జయప్రదమైనది.

## శ్రీకాకుళం

ఫిబ్రవరి '92లో శ్రీకాకుళం హిందీ విశారద విద్యాలయంలో ప్రమాణ పత్ర వితరణోత్సవం జరిగింది. ఈ కార్యక్రమానికి విద్యాలయం కరస్పాండెంటు శ్రీ జె. కామేశ్వరరావు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా స్థానిక డిగ్రీ కళాశాల హిందీ అధ్యాపకులు శ్రీ కె. అప్పలనాయుడు పాల్గొన్నారు.

అధ్యక్షులు మాట్లాడుతూ విద్యాలయాభివృద్ధికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు. ముఖ్య అతిథి శ్రీ అప్పలనాయుడు మాట్లాడుతూ, హిందీ భాషను అందరూ చదువుకోవాలి, హిందీ వలన ఎన్నో ఉపయోగాలు ఉన్నాయని అన్నారు. ఈ సందర్భంగా ఆయన విద్యాలయాభివృద్ధికి వెయ్యినూట పదహార్లు విరాళమిచ్చారు.

విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ పి. లక్ష్మణ శర్మ మాట్లాడుతూ, విద్యాలయం అభివృద్ధికి అందరూ సహకరించాలని కోరారు.

ఈ సందర్భంగా పిల్లలకు వ్యాసరచన పోటీలు నిర్వహించారు. విజేతలకు ముఖ్యఅతిథి బహుమతులు అందజేశారు. హిందీ పరీక్షలు పాసైన విద్యార్థిని-విద్యార్థులకు కరస్పాండెంటు ప్రమాణ పత్రాలు అందజేశారు.

శ్రీయుతులు భూపతి నారాయణస్వామి, కొండలరావు, కేదార దొర తదితరులు మాట్లాడారు.

శ్రీ యస్. బ్రహ్మాజీ వందన సమర్పణతో నాటి కార్యక్రమం ముగిసింది.

## జంగారెడ్డి గూడెం

జంగారెడ్డిగూడెం జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాలలో 1-12-91 తేదీన సా॥ హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము" అత్యంత వైభవముగా జరిగినది. ఆనాటి సభ కుమారి కె. అనిత యమ్. బిందుమాధవి ప్రార్థనతో ప్రారంభమైనది. సభకు గ్రామసర్పంచ్ శ్రీ కామిరెడ్డి వెంకటరామారావు అధ్యక్షత వహించిరి. పాఠశాల అభివృద్ధి కమిటి అధ్యక్షులు శ్రీ కాకర్ల నరసింహమూర్తి జ్యోతి ప్రజ్వలన కావించిరి. ముఖ్య అతిథిగా కొయ్యలగూడెం ఉపవిద్యాశాఖాధికారి శ్రీ అద్దం నూకయ్య జిల్లా పరిషత్ విద్యాశాఖాకారి శ్రీ కె. పాపారావు పాల్గొనిరి. ముఖ్య వక్తగా జంగారెడ్డిగూడెం ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ ఆచంట సర్వేశ్వర దక్షిణామూర్తి విచ్చేసిరి. స్థానిక పాఠశాల హిందీ పండిట్ యమ్. జగన్మోహనరావు హిందీ ప్రచార కార్యక్రమ నివేదిక చదవగా వందన సమర్పణతో సభ ముగిసినది.

## అనంత పురం,

ద. భా. హిందీ ప్రచార సభ. ఆంధ్ర ప్రదేశ్ హైద్రాబాద్ వారిచే నిర్వహింపబడు 'హిందీ పరిచయ్' మౌఖిక పరీక్షా ప్రమాణ పత్ర వితరణో త్సవము ది 28-11-91న స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాల యందు నిర్వహించబడినది.

హిందీ ప్రచారకులు శ్రీ ఏ బి. ఉమాశంకర్ గారు అతిథులకు స్వాగతము పలుకుచూ సభ విషతను వివరించిరి.

సభకు శ్రీ రాజిరెడ్డి, ఎం.ఎ.(హిందీ లెక్చరర్) గారు అధ్యక్షత వహించిరి.

శ్రీ యన్. రామకృష్ణరావు (హిందీ పండిట్, ఆత్మకూరు) అధ్యక్షులు, పట్టణ హిందీ ప్రేమి మండలి) గారు తమ వుపన్యాసములో పరీక్షల కొరకే హిందీ భాషను నేర్చుకొనకుండా, జాతీయ సమైక్యతకు తోడ్పడు విధముగా హిందీ భాష నభ్యసించవలెనని నుడివిరి.

శ్రీ పి. వెంకటనాయుడుగారు, హిందీ ప్రచారంలో భాగంగా నిర్వహింపబడుచున్న వుచిత హిందీ తరగతులలో చేరి, హిందీని నభ్యసించినచో మనకు చాలా ప్రయోజనకరముగా నుండునని చెప్పిరి. శ్రీ నాయుడుగారు, పరీక్షలో ఉత్తీర్ణులైన వారందరికి ప్రమాణ పత్రములనొసంగిరి.

శ్రీ వై.యస్.యన్. రెడ్డిగారు,శ్రీమతి ఛాయా భూషణ్ గార్లు కూడా హిందీ ప్రాముఖ్యతను వివరిస్తూ వుపన్యసించిరి.

శ్రీ ఎ.బి. ఉమాశంకర్‌గారు వందన సమర్పణచేసిన తర్వత జాతీయ గీతముతో సభ ముగిసెను.

## భవానీహిందీవిద్యాలయం,అనంతపురం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర హైద్రాబాద్‌వారి ప్రారంభిక పరీక్షార్థుల స్వాంత సమారోహ్ (వీడ్కోలు సభ) తేది 6-2-92 గురువారం) స్థానిక శ్రీ లక్ష్మి కాన్వెంటు నందు "శ్రీ భవానీ హిందీ విద్యాలయము అధ్వర్యములో నిర్వహించబడినది.

ప్రారంభములో శ్రీ సరస్వతీ, శ్రీగణేశ్ పూజలు జరుపబడినవి. తర్వాత జరుపబడిన సమావేశమునకు శ్రీమతి సరోజమ్మ ప్రధానోపాధ్యాయిని శ్రీలక్ష్మి కాన్వెంటు, పాతఊరు, అనంతపురం, గారు అధ్యక్షత వహించిరి. తమ వుపన్యాసములో హిందీ మన జాతీయ భాషయని, ప్రతివ్యక్తి హిందీని తప్పక నేర్చుకొనవలెనని, విద్యార్థులకు హితబోధ చేసిరి.

విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ ఎ.బి. ఉమాశంకర్ గారు తమ వుపన్యాసంలో, ద. భా. హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైద్రాబాద్ ద్వారా జరుపబడు పరీక్షల కార్యక్రమములను వివరిస్తూ, ప్రతి విద్యార్థి ఆ సభ ద్వారా జరుపబడు హిందీ తరగతులకు హాజరై, హిందీ నభ్యసించి పరిక్షలకు కూర్చొన వలెనని ప్రోత్సహించిరి.

హిందీ ప్రచారకురాలు శ్రీమతి ఎ.బి. భవానీ వందన సమర్పణ చేసిరి. తదనంతరము విద్యార్థులకు పరీక్షా ప్రవేశపత్రము లొసంగుబడెను.

జాతీయ గీతంతో సభ ముగిసెను.

GOVERNMENT OF ANDHRA PRADESH

**ABSTRACT**

Hindi Training Institutions–Starting of Hindi Pandit Training courses in Government Colleges of Education and conduct of Hindi Pandit Training Course by Private Educational Organisations from the acadamic year 1992–93–Orders–Issued

EDUCATION (SS) DEPARTMENT

**G.O.Ms.No. 177 Edn.** **Dt. 29-4-1992.**

Read the following :–

Ref :– 1. From the Director of School Education, Hyd. letter Rc. No. 770/N1-3/91 dt. 10-6-91.

2. Govt. Memo No. 1903/SS2/9-1 Edn Dt. 6-9-91 & 6-1-92.

3. From the Director of School Education, Andhra Pradesh, Hyderabad, letter Rc No. 770/N1-3/91 Dt. 9-1-1992.

–:X:–

**ORDER :–**

In the circumstance stated by the Director of School Education, Andhra Pradesh, Hyderabad, in the letter first & third read above, Government after careful consideration of the proposals of the Director of School Education, hereby accord permission to start Hindi Pandit Training course from the Academic Year 1992–93 in Government Colleges of Education at, Hyderabad, Warangal and Nellore and also permission to conduct Entrance Test by the commissioner for Government Examinations, Andhra Pradesh, Hyderabad for private Hindi Training Institutions on par with Government Colleges from the academic year 1992–93

The Director of School Education, Andhra Pradesh, Hyderabad, is requested to finalise the list of centers for private Institutions on the basis of need in the locality without any financial commitment to Government and take immediate action accordingly.

This order issues with the concurrence of Fin. & Plg (EE) Dept. vide their U. O. No. D. 92-01/239/140-EE/92, Dt. 7-2-92.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF ANDHRA PRADESH)

K S SARMA
Secretary to Government

To
The Director of School Education, A. P. Hyderabad.
The Director, A. P. Text Book Press, Hyderabad.
All R.J.D.S.E.'s in the State.
All District Educational Officers in the State.
The Principal, Govt. Comprehensive College of Education, Masabtank, Hyderabad. & Nellore
The Principal, Govt. College of Education, Warangal.
Copy to Hindi Prachar Sabha, Nampally, Hyderabad.
Copy to Dakshina Bharat Hindi Prachar Sabha, P. B. No. 23, Khairatabad, Hyd.
Copy to Sf/Sc.

// FORWARDED : BY ORDER //

(Sd.) SECTION OFFICER

